నిర్వచన

# భారతగర్భరామాయణము

"కవితాకోవిద"

రావిపాటి లక్ష్మీనారాయణ.

Text book for B. Vidwan Final Examination for the years 1936, 1937 and 1938 and Bhasha Pravina for the Text 1956.

---

## నిర్వచన

# భారతగర్భరామాయణము

Chancellor of the
Andhra Research University యు,
జయపుర మహారాజాగారగు, H. H. Saheb Bahddur
శ్రీ శ్రీ శ్రీ విక్రమ దేవవర్మగారు 6—5—53 న
“కవితాకోవిద” యను బిరుదు నిచ్చిరి.

## రావిపాటి లక్ష్మీనారాయణ.



మూడవ కూర్పు 1000 ప్రతులు.

శ్రీ రామకృష్ణా ముద్రాక్షరశాల, నరసరావుపేట.

 1954 [వెల 1—0—0.

# అవతారిక

శ్రీమదాంధ్రభాషను సర్వతోముఖముగ నొనర్చినంగాని దానినుండివలసిన లాభముఁబొందలేము. నవలలు నాటకములు, జీవితములు ప్రబంధములు, చరిత్రలు, లక్షణగ్రంథములు, విమర్శనములు, వ్యాకరణములు, శతకములు, నిఘంటువులు మొదలగునవి యాంధ్రవాఙ్మయమునందలి యంతర్భాగములు.

కావ్యలక్షణమును భోజుఁడు శ్లో॥ నిర్దోషం గుణవత్కావ్యమలంకారైరలంకృతం। రసాత్మకం కవిః కుర్వన్। కీర్తిం ప్రీతించ విందతి" యని వ్రాసినాఁడు. నరసభూపాలీయమునందును "కవితాలతాంగి హారకటక కంకణాదుల క్రియనలంకరణకరణ పరిణతులచే నలంకార భావమొందు" నని వ్రాసియున్నాడు. "నిరంకుశాః కవయః" యనినట్లు బ్రహ్మసృష్టికంటె కవిసృష్టి యతీతము. బ్రహ్మసృష్టి ప్రకృతిననుసరించియే యెల్లప్పుడుండును. కాని కవిసృష్టి యొకానొకచో ప్రకృతి విపరీతము.

ఉభయభాషాపాండిత్య సామర్థ్యముఁదెల్పు కావ్యములలో పింగళి సూరనార్యుని రాఘవపాండవీయమును, రామరాజభూషణుని హరిశ్చంద్రనలోపాఖ్యానము వన్నెకెక్కినవి. పోడూరి పెదరామామాత్యుని శివరామాభ్యుదయము, పిండిప్రోలు లక్ష్మణకవి రావణదమ్మీయము, మంత్రిప్రగడ సూర్యప్రకాశముగారి కృష్ణార్జున చరిత్రము, మృత్యుంజయకవి ధరాత్మజాపరిణయము మున్నగు ద్వ్యర్థికావ్యములును నయ్యగారి వీరభద్రకవిగారి రాఘవపాండవయాదవీయము, భట్టర బాలసరస్వతి కృతమగు రాఘవయాదవపాండవీయము, నెల్లూరి వీరరాఘవకవి యాదవరాఘవ పాండవీయము, ఓరు

గంటి సోమశేఖరకవి రామకృష్ణార్జునరూపనారాయణీయము మున్నగు త్ర్యర్థులుగలవు. సంస్కృతమునందుఁ జిదంబరకవి ప్రణీతమగు రాఘవపాండవయాదవీయ మొకటి వావిళ్ళవారిచేఁ బ్రకటింపబడినది మాగ్రంథాలయమునఁగలదు.

ఇక నిర్వచనకావ్యములు తిక్కననాటినుండి కుప్పతెప్పలుగా బయలుదేరుచున్నవి.

పూర్వకవీంద్ర విభాగిత చతుర్విధాంధ్ర కవిత్వంబులలో గర్భకవిత్వంబొకటి. ఒకపద్యంబునఁ బెక్కుపద్యంబులిమిడి ఛందోర్థదోషములు లేకుండునది గర్భకవిత్వంబు. పూర్వకవీంద్రుల ప్రబంధములలో నచ్చటచ్చటను, నాశ్వాసాంతములందును, గణపవరపు వేంకటకవిగారి ప్రబంధరాజపరమేశ్వర వేంకటేశ్వరవిలాసమందుఁ గొంచెమువిరివిగాను గర్భకవిత్వంబు గన్పట్టుచున్నది. గ్రంథాదినుండి యంత్యమువఱకు గర్భకవిత్వముతోఁ దనరారు కావ్యమెందును నింతవఱకు మేము చూడలేదు. ఈ నిర్వచన భారతిగర్భరామాయణ మిట్టికొఱఁత దీర్చినది.

గ్రంథకర్త యార్వేల నియోగి బ్రాహ్మణుఁడు. ఆపస్తంబ సూత్రుఁడు. పోతనాదికవులు జన్మించిన కౌండిన్య గోత్రుఁడు. గుంటూరుజిల్లా నరసరావుపేట తా లూ కా రావిపాడు స్వగ్రామము. ప్రస్తుతము గురిజాల డిస్ట్రిక్టు మునసఫ్ కోర్టులో గుమాస్తాయుద్యోగమందున్నాడు. ఆంధ్రమందే గాక హూణవిద్యయందునుఁ బ్రవేశముగలదు ఈగ్రంథమందుఁ బ్రతిపద్యమందు మఱియొకపద్యము గర్భస్థమైయుండును. మూల పద్యములు రామాయణార్థము, గర్భస్థపద్యములు భారతార

మిచ్చెను. కవిత్వము నిర్దుష్టమై రసవంతమై వ్యాకరణాదిదోష రహితమై సలక్షణమైయున్నది. ధారాళముగాను ద్రాక్షాపాకముతోనొప్పుచున్నది. శ్లేషయెక్కువలేక సులభముగానున్నది. అయిన నేకథకాకథ చదివినఁ జాలసులభముగా నుండును. అక్కడక్కడ ప్రౌఢముగా లేకపోలేదు. ఉదాహరణము:- సూర్యాస్తమయములోపల సైంధవుని జంపుటకును, నట్లు చేయలేనిచో నగ్నిచొచ్చుటయును ప్రతిజ్ఞ నర్జునుఁడు సేయుట యను భారతార్థము గర్భమునగలిగి రాముని జంపెదనని యింద్రజిత్తు రావణునితోఁ బలుకుట యను రామాయణార్థముగల 109 వ పద్యము.

అచ్చ తెలుగుపద్యము, చతుర్విధాష్టకందములు, నిరోష్ఠ్యము, ముక్తపదగ్రస్తము పుష్పమాలికాబంధము, నాగబంధములయందును గర్భపద్యముల వదలకయే వ్రాయుట యీతని భాషాసామర్థ్యమును వెల్లడించుచున్నది, 'పరఁగ జిగురాకు చేతుల' యను 41 వ పద్యమునందును 'అని విజయరక్తై' యను 102 వ పద్యమునందు శ్లేషాలంకారమును, 101 వపద్యమున నుపమాలంకారము లతిహృద్యములుగానున్నవి. వివాహవేదికయందుసీతారామునికంఠసీమను బుష్పమాలిక వేయుటనుఁ బుష్పమాలికాబంధమందే వ్రాసిచమత్కరించినాడు. 44,45,46, 47,48పద్యములుచాలస్వాభావికములునుమనోజ్ఞములనున్నవి.

మఱియు నుభయకథలోను వివాహముల శ్లేషించిన పిమ్మట నరణ్యాగమనము శ్లేషింపవలసియున్నది. మధ్యను రామాయణమునఁ గైక దశరథుని వరములడుగుట మొదలగు కొద్దికథయే యున్నది. కాని భారతమునఁ బాండవులు నియమ

(117వద్యము) రామాయణార్థమున వ్యంజనయతియు భార తార్థమునఁ బ్రాసయతియు వచ్చునట్లు 'దమకము'నుఁబ్రయో గించినాఁడు. సంగరమహి (మాతులబలునండ చేతఁగృష్ణ)... (119వ పద్యము) రామాయణమున; అతుల యనుచో 'అ' కారమునకు స్వరయతియు భారతమున 'మాతుల' యనుచో 'మ' కారమునకు వ్యంజనయతియు రావలసియుండుటచే నీ రెండుయతులవదలి 'చేత' యను ప్రాసయతినిఁ బ్రయోగించి నాఁడు. ఇట్టి చిత్రంబులెన్ని యేనియుఁగలవు.

98,99,100పద్యములలో నొక్కొక్క పద్యమం దొక్కొక్క రసముంచి యాయారసనామములను నాయా రామాయణార్థ పద్య చతుర్థపాదాంతమున నుడివిచమత్కరించినాఁడు. "నేతవి దుముకుమతినివిసు సీతాజననంబు లంకచేటునకసుమీ" యను చో (92వ పద్యము)భారతార్థమున; "సీతా జననంబు లంకచేటు నకె సుమీ" యనునది సాభిప్రాయముగాఁ బ్రయోగించి సీతపుట్టుట లంకకెట్లుచేటో యట్లె దుర్యోధనుని పుట్టుక ధృతరాష్ట్రుని రాజ్యశ్రీనాశనమునకే యనునర్థము ధ్వనింపజేసినాఁడు.

దుస్తరమగు గర్భశ్లేషలుండినను గ్రంథమునందచ్చ టచ్చట లోకోక్తులు దేశీయములు, కవిసమయములు నలం కారములు చక్కగాఁ బొందుపఱచినాఁడు. మచ్చునకు.

"దుఃఖకృత బదహతులఁ బూచినీపైనఁబడు పూరెతెల్పు శుభ ము" (94వ పద్యము)......కవిసమయము.

| | |
|---|---|
| అవనిఁదామరతంపరలైరిచాల | పద్యము 29 |
| శుభస్యశీఘ్రముమ్మని | 53 |
| ఒకటి తానెంచదైవ మింకొకటిసేయు | , |

మూడుపూలాఱు కాయలగునటంచు 54

రంగరంగవైభవములతో 58

కొన్ని లోకోక్తులను రెండుపద్యములకు వచ్చునట్లు వ్రాయుట దుస్తరము (౭౭వ పద్యమును జూడుఁడు). ఇట్టి వెన్నియో కలవు.

-♦ కథాద్వయమైత్రిలో గొన్ని ముఖ్యమార్పులు ♦-

| పింగళి సూరనార్యకృత రాఘవపాండవీయము. | ఈగ్రంథము. |
|---|---|
| 1 విశ్వామిత్రునితో రామలక్ష్మణులు పోవుట, పాండురాజ మరణము. | విశ్వామిత్రునితో రామలక్ష్మణులు పోవుట పాండవులు వారణావతమునకు వెడలుట. |
| 2 రామపరశురాముల సంభాషణము. భారతములోఁ గథ కొంతవఱకు. | రామ పరశురామ సంభాషణము లేదు. |
| 3 సీతను రావణుఁడు హరించుట. జటాసురుఁడు ద్రౌపదిని హరించుట | సీతను రావణుఁడు హరించుట. సైంధవుడు ద్రౌపదిని హరించుట |
| 4 అంగద రాయబారము కృష్ణరాయబారము | సుందరకాండములో హనుమద్రావణ సంభాషణము కృష్ణరాయబారము |
| 5 అతికాయవధ. ద్రోణవధ | మహాల్యసైన్యవధ. ద్రోణవధ. |
| 6 ఇంద్రజిద్వధ. కర్ణవధ. | కాలనేమివధ కర్ణవధ. |
| 7 విరూపాక్షవధ. శల్యవధ. | మాల్యవంతవధ. శల్యవధ. |

మున్నగునవి.

'శ్లేషేసఖండనిర్బిందోర్మేళనం కుత్రచిత్స్మృతమ్మను నథర్వణ కారికావచన ప్రకారమున శ్లేషయందచ్చటచ్చట నర్ధానుస్వారమునకును, నిర్బిందువుకును సమ్మేళనము చేయబడినది.

ఇతడు ముఖ్యకథాంశము దేనిని విడలలేదు. రాఘవపాండవీయ మందు గనుపట్టని భగవద్గీతావిషయమునఁ గూడ నిమిడ్చినాఁడు

సూరనార్యుని యంతటి ప్రజ్ఞానిధియు "రెండర్థములపద్య మొకటియు నిర్మింపంగ శక్యంబు గాకుండుఁ దద్గతికావ్యమెల్ల యగునే" యని వ్రాసికొనినాఁడు. అట్టిచో శ్లేషయే కాక గర్భకవిత్వ ముగూడ వ్రాయుట కష్టతరము "స్యాతాం యది దోషా శ్లేషాదావితా స్త్రప్రయుక్తే" యను యలంకారికవచనమున్నను, నీకవి సుప్రసిద్ధార్థములు గలపదముల నే ప్రయోగించి, లక్షణవిరుద్ధమగు మగు మార్గమునఁబోక, సరళముగాను స్వతంత్రముగాను నందఱకుఁ దేటతెల్లముగా వ్రాసినాఁడు. అసామాన్యవృత్తములు వ్రాయలేదు;

శబ్దములనందముగా నితరకథలోనికి మార్చినాఁడు. స్థాలీపులాక న్యాయముగా నుదాహరణము:- ఏకచక్రపురమ (34వ పద్యము) రామాయణార్థమున ఏక-ఒక, చక్ర-విష్ణు చక్రముయొక్క, రమ-శక్తియనియు, భారతమువ, ఏకచక్ర-ఏకచక్రమనఁబడు, పురము:-అ-పురమే యనియు విగ్రహము నిచ్చినాడు.

ఈ గ్రంథకర్త వయస్సిరువదిమూఁడు వత్సరములు. ఇట్టి బాల్యమున రచించిన యిట్టి కష్టతరమగు కావ్యములో దోషములఁ బాటింపక మఱికొన్ని గ్రంథముల రచించుటకుఁ బ్రోత్సాహమొసంగెదరని చదువరులనుఁ బ్రార్థించుచు గ్రంథ విస్తరభీతిచే నింతటితో విరమించుచున్నాము.

× జలకొండ
కర్నూలుజిల్లా
30-12-32

ఇట్లు, బుధవిధేయులు,
గౌరావఝుల రామకృష్ణ సీతారామ సోదరకవులు
శతావధానులు, ఆశుకవిచక్రవర్తులు, అభినవబాణక.
బిరుదాంకితులు శ్రీ సచ్చిదానంద గ్రంథాలయము

# మనవి

అవతారిక వ్రాసినవారికి, నభిప్రాయములిచ్చినవారికిఁ గృతజ్ఞుడను. దోషములను క్షమింపవలెను. దయతోఁ దెలిపినచోఁ బునర్ముద్రణమున సవరించుకొనెద. రామాయణమునకు 'రా' యనియు, భారతమునకు 'భా' యనియు గుర్తులుంచబడినవి.

ఏకథ కాకథ చదివినచో సులభముగా నర్థమగును. భారతార్థపద్య మొక్కొక్కచోట నొకపాదమునకు తక్కువకాకుండ రామాయణార్థ పద్యమం దిముడ్చబడినది.

గ్రంథకర్త.

# పండితాభిప్రాయములు.

కడియము తూ॥ గో॥ డి. 29-5-32.

నిర్వచనభారతగర్భరామాయణమను నీక్రొత్తపోకడగల పొత్తమును మ॥ రా॥ శ్రీ॥ రావిపాటి లక్ష్మీనారాయణగారు రచించిరి. ఇందుఁ బ్రతి పద్యమందును గర్భకవిత్వముండుననుసంశయము నామమువలననే స్ఫుటమగుచున్నది. కాన విస్తరింప బనిలేదు. ద్వ్యర్థి కావ్యముల రచించినవారు కలరుకాని యింతవఱకుఁ గబ్బమెల్ల నిట్లు రచించినవారు నాబుద్ధికిఁ బొడగట్టరు. ఇట్టి కష్టతరమగు రచనకుఁ బూనుకొన్న యీకవి రచనలో నావిన్నయంతలో వ్యాకరణాది దోషములు లేశమును గానవచ్చుటలేదు. నిర్దుష్టమై రసవంతమైయున్న యీయన రచనను నేను మిక్కిలిగా నభినందించుచున్నవాఁడను. దీనిని విద్యాశాఖవారు తప్పక స్వీకరింతురని నా పూర్ణవిశ్వాసము. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి, శతావధాని.

---

C. R. Reddi Padmaprabhasa, Chittore.

Dear Sir,

Thanks. Yours is a very creditable performance. Your taste and scholarship are admired.

Yours truly

C. R. Reddi.

---

అయ్యా! రాజమండ్రి 9-4-32.

తమరు పంపిన జాబును మీరచించిన "నిర్వచనభారతగర్భరామాయణము"ను వ్రాఁతప్రతిని చాలభాగము చదివినాఁడను. ఇందులో మీరు మిక్కిలి శ్రమచేసినారని చెప్పుటతిశయోక్తి కాజాలదు. ప్రతి పద్యమునందును గర్భపద్యములు చెప్పుటయే కష్టము. అందుపై మూల పద్యములు రామాయణము గర్భస్థపద్యములు భారతమును దెల్లడించునట్లు గ్రంథము వ్రాయుట కష్టతరమని చెప్పకచెప్పెడిని. మీపరిశ్రమను నేను మిక్కిలి యచ్చెరువునొందితిని. ఇప్పటివారిట్లు గర్భశ్లేష కవిత్వము చెప్పుటరిది. మీపద్యములు ధారాళముగనున్నవి గర్భవృత్తములుండినను శ్లేష గలిగినను మృదుత్వమును శయ్యాసౌష్ఠవమును విడువక మనోహరముగానున్నవని త్రికరణశుద్ధిగా చెప్పుచున్నవాఁడను శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి.

---

మహారాజశ్రీ రావిపాటి లక్ష్మీనారాయణగారికి వడ్డాది సుబ్బారాయఁడు వినతిగావించు విన్నపము.

అయ్యా!

మీర లాదరపూర్వకముగా పంపిన భవద్విరచిత భారతగర్భ రామాయణ ముద్రితపత్రములు చేరినవి. అపూర్వమయిన నియమములతో రచించిన మీగ్రంథము నాకాశ్చర్యము కలిగించినది.

మ॥ ప్రతిపద్యంబున నేకవర్ణ్యనియముల్ పట్టించి ప్రాసంబులన్
యతులన్ వ్యాకృతినియముల్ చెడకయుండం గావ్యముం జేయుటే
యతికష్టంబిటు పద్యమందితర పద్యంబొండు చొప్పించి భా
రతరామాయణగాథలేకకృతి గూర్పంజాలి తేమందునిన్

తే॥ నిండుఁబూలాల దాపని నెమ్మి రామ
కథనుడువుచుండ, భారతగాథగర్భ
శిశువుపలికెడు భంగి భాసిల్లురావి
పాటిలచ్మినారాయణు పద్యపఙ్క్తి

చిత్తగింపుఁడు

వ॥ సుబ్బారాయఁడు.

---

12-12-32 రాజమహేంద్రవరము.

మహారాజశ్రీ రావిపాటి లక్ష్మీనారాయణగారికి చిలకమర్తి లక్ష్మీనరసింహము దీవించి వ్రాయునది.

అర్యా!

మీరు దయతోఁబంపిన నిర్వచన భారతగర్భరామాయణమను గ్రంథము చేరినది. చదివించుకొంటిని. ఈకాలమున నిట్టిగ్రంథము రచియించువారు మిక్కిలి యరుదుగనున్నారు. మీ పాండిత్యము మీ ప్రతిభయు, మీ కవితాధారయు, మిక్కిలి శ్లాఘాపాత్రములుగనున్నవి. నడుమనడుమ నిరోష్ఠ్య పద్యములు, ముక్తపదగ్రస్తములు మొదలైనవికూడ రచియించుట మిక్కిలి ప్రశంసనీయము. కవిత్వము చాలవఱకు సులభమై లలితమైయున్నది. భగవంతుఁడు మీకు దీర్ఘాయురారోగ్యములనిచ్చి రక్షించుఁగాక.

ఇట్లు

మీ శ్రేయోభిలాషి,

చి॥ ల॥ నరసింహం.

నెల్లూరు 22-12-32.

అయ్యా!

తాము పంపిన గ్రంథభాగ మందినది. స్థాలీపులాకన్యాయముగా పఠించితిని. సనాతనాధునాతనకవులెవ్వరు త్రొక్కియుండని క్రొత్తమార్గమును త్రొక్కిన మీ యుద్యమము కొనియాడదగినది. రామాయణమున భారతమిమిడ్చిన మీ చాతుర్య మనల్పము. పద్యమున మఱియొకపద్య మిముడ్చుటయే దుష్కరము. అట్టిచో నాపద్యములను బంధముల నిబంధించుట కరము దుష్కరము. ఇన్ని నిర్బంధనలకులోనై కావ్యము సలక్షణముగా కొనసాగించిన మీకవితాపాండితి పండితశ్లాఘ్యము గదా.

ఇతి విధేయః

దీపాల పిచ్చయ్యశాస్త్రి.

---

మహాశయా!

తమరనిపిన "నిర్వచన భారతగర్భ రామాయణమును" గ్రాంథ పుస్తకమునఁ గొంతభాగము చదివితిని. ముద్రించుపత్రియు నింతలోఁ జేరెను. దానినంతయుఁ బఠించితిని. ఇది క్రొత్తసృష్టియనవలెను. ఈ ప్రయత్నము మున్నెవ్వరు చేసియున్నట్లు నా యూహించినంతదనుక గనఁబడదు. ఇది విశ్వామిత్రసృష్టివలె గాక శతానందుని సృష్టివలె సకలజనానందకరమై చెన్నారుచున్నది. మీపట్టిన శ్రమము కృష్ణదేవరాయలవంటి ప్రభువుల కాలమున జేరైన నభినవనాగను కావమదన్న బిరుదము లభింపక పోదని నావిశ్వాసము. "సమానానాముత్తమ శ్లోకో అస్తు" అను సూక్తి కుదాహరణభూతులరైతిరి. మీ యీకృతి సర్వవిధముల సంస్తుతముని పరమేశ్వరానుగ్రహమున నీకృతి దశదిశల వ్యాపించి యొసంగు ఖ్యాతిని వారక గోరుచున్నాఁడను. ఈకృతికన్యకామణి పదములాలంకారశోభితయై సద్వర్ణవిరాజమానయై మనోజ్ఞరూపమున నలరారి సరసకవిజనానందదాయినియై నిత్యపూతయై సతతసమ్మత సజ్జనాశ్రితయై యొసంగు గాక.

ఇట్లు విన్నవించు

సత్కవిశ్రేయోభిలాషి

జనమంచి శేషాద్రిశర్మ.

## కూచి నరసింహముగారి యభిప్రాయము.

Pithapuram,
26-3-33

Dear Sir,

Very many thanks for the copy of your "నిర్వచన భారతగర్భరామాయణము" kindly sent to me. It is an elaborate literary production indicative of the depth of your scholarship and the adminable capacity you possess for composing intricate Telugu Verses giving double meanings throughout the book I shall have the pleasure of going through the book at leisure.

Yours Sincerely,
K. NARASIMHAM.

---

## గిడుగు వేంకటరామమూర్తిగారి యభిప్రాయము.

పర్లాకిమిడి 15-2-34.

ఆర్యా! నమస్కారములు

మీరుపంపిన నిర్వచన భారతగర్భరామాయణము ప్రతి అందినది. చాలాభాగము చదివినాను. పూర్వులు రచించిన ద్వ్యర్థికావ్యములలోని కవిత్వ చమత్కారముచూచి అద్భుతమైనదిగా సంతోషిస్తూ ఉండేవారము. ఆగ్రంథములలో లేని రచనాచాతుర్యము మీ కావ్యములో కనబడుతూఉన్నది గర్భకవిత్వముతో కలిపి ద్వ్యర్థి కావ్యమురచించుటకు మీరేమార్గదర్శకులు. ఇటువంటి కావ్యములుకూడా పండితులకు ఆదరణీయములే. పండిత పామరజనోపయోగ్యముగా కావ్యములురచించి వాటిలోకూడా మీ కవిచాతుర్యం కనపరచవలసినదని కోరుతున్నాను. సర్వజనసామాన్యంగా ఆంధ్రులకుసుబోధములయి ఆంధ్రులమనోవికాసమును కలిగింపగల కావ్యములు మీవంటికవులురచించవలెనని నాకోరిక.

గి॥ వేం॥ రామమూర్తి.

---

# నిర్వచన

# భారతగర్భ రామాయణము

శా॥ శ్రీనాళీకభవాండ మాకృతి, ధరిత్రీపాళి పాదంబు మి
న్నే నాభిస్థలి, స్వర్గమే శిరము, చిచ్చే యాననాబ్జంబు, భ
స్వానేందుల్గనుల్, లాశలే చెవులు, గాడ్పే ప్రాణమౌ వేల్పు నే
కో నారాయణ యంచు ముక్తికొఱకై కోరన్ ధృతిం గొల్చెదన్॥

చం॥ పలుకుల బోటిఁ బొంది భువి పౌజు సృజించెడి బ్రహ్మ దానయై
కలుముల చెల్వతోడుత జగమ్ములఁ బెంచెడి శౌరి దానయై
చలిమల కూఁతునుం గలిసి సర్వము ద్రుంచెడు శూలి దానయై
చెలువుగ దక్షు వేల్పులయి చెన్నగు నా యఖిలేశుఁ గొల్చెదన్॥ 2

టీక॥ పౌజు-గుంపు, మల-కొండ శూలి-శివుడు

సీ॥ ఎవ్వాని యాజ్ఞ మొయిళ్లు చిల్లులు పడ్డ
కరణినిఁ దృటి వాన గురియుచుండు,
నెవ్వాని యాజ్ఞచే నెక్కడ్క గట్టులఁ
బల్లంబు జలముప్పు పాఱుచుండు,
నెవ్వాని యాజ్ఞచే నినశశితారక
లెప్పుడు తమ చొప్పుఁ దప్పకుండు,
నెవ్వాని యాజ్ఞచే నీ భూతనివహంబు
పుట్టుచుఁ బెరుగుచు గిట్టుచుండు,

తే॥ నెవఁడు సర్జించు మఱలను నడిపించు
నెవఁడు మట్టిగో సదయత నెప్పు మనుచు
నెవఁడు మొగ్గలకును రంగు లిడుచుండు
నా మహామహు నఖిలేశు నాత్మ నెంతు॥

టీక॥ విసరంబు = గుంపు, ఎఱ్ఱ = వానపాము.

కం॥ విఘ్నేశ్వరుఁడయి దుష్టకృ
తఘ్నస్వార్థకపటకలితప్రబలోద్యో
గఘ్నుఁడయి సుకార్యములకు
విఘ్నములనుఁ బాఱద్రోలు విభునిఁ దలఁచెదన్॥ 4

ఉ॥ ఉల్లమునందు భక్తిని ఘనోరగగేహజు, వ్యాసు, దండి, ధీ
వల్లభుఁ గాళిదాసకవి, బాణుఁ గవిప్రియభాస్కరేంద్రులం
బెల్లగు సోముఁ, బోతనను, బెద్దన, సూరన, మూర్తిఁ దిమ్మనన్
మొల్లను, వేంకమాంబ మఱి యార్యుల నిప్పటివారి నెంచెదన్॥

టీక॥ ఉరగగేహజుడు = వాల్మీకి.

కం॥ అనుమానానేకము దీ
ర్చినమహితుఁడు దుగ్గరాజు సీతారామ
య్యనుఁ గొలుతు వె డి సిందుమ
తిని వేంకటపార్థసారథికవులఁ దలఁతున్॥ 6

కం॥ తెలియని శబ్దార్థము పె
ద్దల నడిగి గ్రహింపఁబోక తప్పని ధృతితోఁ
బలుకుచు నితరుల భావం
బులను హరించెడు కుకవులమూఁకఁ దెగడుదున్॥ 7

తే॥ రామకథ నిర్వచనముగ వ్రాయుచుఁ, బ్రతి
పద్యమందున వేఱొక్క పద్యమును,
నట్టి గర్భితములగు పద్యముల నెల్ల
వసుసహోదుతఁ జనుపఁగా భారత మగు॥ 8

కం॥ కలియుగ మఱుపదివేల న
వల ముప్పది యయిని రెండవది; క్రీస్తుశకం

బాలయగఁ బడితొమ్మిది వం
దల ముప్పదియొకటిలో నానరించితిఁ దీనిన్॥ 9

తే॥ శ్రీనగమున కీశాన్యంబు, కృష్ణకు శను
నదశ, గుంటూరుజిల్లాను నరసరావు
పేటతాలూకలోపల వెలయు రావి
పాఁడు స్వగ్రామమై నాకు వఱలుచుండు॥ 10

సీ॥ భారతీయుండ, బాపండ నాపస్తంబ
సూత్రుండఁ గౌండిన్యగోత్రజుండ,
బండితాగ్రేసరమండలమునకు న
త్యధికవిధేయుండ, నాఱువేల
వాఁడను, ముత్తాత వఱలును జలముల
రాజసం, గొండ రాజు తాత,
కొండలరాజనకుఁ జలమయ్య య
ప్పయ్య నాఁ గలిగి రం దగ్రజుండు

తే॥ చలమయ్య సతి పిచ్చమ్మ వలనను జని
యించితిమి వేంకటప్పయ్య యేనును గురు
నాథ మనఁగ సుబ్బారావనంగ నం ద
రయ ద్వితీయుండ లక్ష్మీనారాయణుండ॥ 11

ఆ॥ వె॥ విమలకలసి, నవవిధమని, బుద్బుద
యశమునకు పిసంగినైనఁ దలఁచఁ
దూర్పు వీరువయసుకొనుంట, నీకష్ట
సాధ్యకృతికి సాహసము సలిపితి॥ 12

టీక॥ బుద్బుదయశమానకు.......వీరవయసు– షేక్స్పియర్ (Shakesphere) యొక్క As you like it నాటక

ములోని మానవుని సప్తవయసుల ( Seven ages of Man) లో సూచింపబడిన నాలవవయస్సు "A soldier seeking the bubble reputation in cannon's mouth"

తే॥ ధరణిలోఁ "భ్రమాదో ధీమతామపి" యన
నల్పుడనుఁ జడమతిని నే ననఁగ నెంత
జలముల విడి పాలఁ గొను హంసలవిధమున
దప్పుల వదలి యొప్పులఁ దలఁప రయ్య॥ 13

— షష్ఠ్యంతములు —

కం॥ ధీరునకున్ విదళితసం
సారునకు సమస్తవేదసారున కధికో
దారునకును విమలశుభా
కారున కుషమావరహితగంభీరునకున్॥ 14

కం॥ ఘోరునకును నాగమసం
చారున కఘదూరునకును సచ్చిగ్గణవి
స్తారునకును సకలకలుష
హారికి నినశశిముఖాఖిలాధారునకున్॥ 15

కం॥ ఆయఖిలాధీశ్వరునకు
నా యమరేశునకు భక్తి నంకితమును నేఁ
జేయుదు; గర్భకవిత రా
మాయణభారతకథాక్రియం జెట్టిదనన్॥ 16

కథాప్రారంభము

రా॥ఉ॥ శ్రీరమణీయమై (సిరులఁ జెంది వెలుంగును, జిష్ణుగీటి)నిన్
మీఱి,యయోధ్యనా(గరిను మించుచుబృధ్వి;నఖండహాస్త్ర)ర

క్షోరిగృహం బెయా(పురియునచ్చటిమేడలువ్యోమమంటు) మేల్
తోరంపుఖ్యాతితో (నగరిదూగుఁదులన్ హరినట్టతోడ)దాన్
భా. తే॥ సిరులఁజెంది వెలుంగును జిష్ణువీటి
గరిమ మించుచు బృథ్వి నఖండహస్తి
పురియునచ్చటిమేడలు వ్యోమ మంటు;
నగరి దూగుఁ దులన్ హరినట్టుతోడ॥ 17

టీక॥ రెంటికి, జిష్ణువీటిన్-అమరావతిని, హరినట్టు-వైకుంఠము.
రా॥ హస్తిరక్షోరిగృహంబె-గజాసురుని విరోధియగు శివునిల్లు
(కైలాసము) భా. హస్తిపురము-హస్తినాపట్టణము. గరిమ-
గొప్పదనము. వ్యోమము-ఆకాశము.

రా. సీ॥ మాకణమన్నట్టి మాటయే లేదన్నఁ
బొలబోన మనమాటఁ దెలుపనేల
మత్తువస్తువులన్న మాటయే లేదన్నఁ
గలుషచిత్తులమాటఁ దెలుపనేల
చాటుమాటు జెలగు మాటయే లేదన్నఁ
దులవజారీమాటఁ దెలుపనేల
మేటిస్వార్థంబన్న మాటయే లేదన్నఁ
గులము తేస్యలమాటఁ దెలుపనేల
తే॥ (పలుపలుకులేల యచటిజను లనయము స్వ
ధర్మపథమునున్ వదలక తాల్మిని నయ
(నులకు గని యుందురు; పురము లలిఁ గళకళ
లాడుఁ దోటలన్ సరసులతో) డ మివుల॥ 18

భా కం॥ పలుపలుకులేల యచటిజ
ను లనయము స్వధర్మపథమునున్ వదలక తా

మలరు గని యుందురు, పురము

లలిఁ గళకళలాడుఁ దోటలన్ సరసులతో॥ 18

టీక॥ పొలబోనము-మాంసాహారము, అనయము-ఎల్లప్పుడు నయము-నీతి, అలరు-సంతోషము.

రా. చం॥ ముదమున నేలునా (నగరిభూపతి చీకుజనాలకాఁపు) హెచ్చు; దశరథుండనన్ (వెలయుచున్ ధృతరాష్ట్రుఁడు బిట్టుభీష్మ) మాకదనమునందు సచ్ (శరనికాయసహాయతఁ జక్కడంచె) నుగ్రిదనుజకోటులఁ (రిపుల రాజకులేంద్రులఁ రే యనంగ) నన్

భా. తే॥ నగరిభూపతి చీకు, జనాలకాఁపు

వెలయుచున్ ధృతరాష్ట్రుఁడు బిట్టుభీష్మ

శరనికాయసహాయతఁ జక్కడంచె

రిపుల రాజకులేంద్రులఁ రే యనగ॥ 19

టీక. రా॥ చీకుజనాలకాఁపు-గుడ్డిజనుల రక్షించువాఁడు, భా. చీకు గుడ్డివాఁడు-జనాలకాఁపు, జనుల రక్షించువాఁడు, భీష్మ-(రా) భయంకరము (భా) భీష్మునియొక్క, ధృతరాష్ట్రుడు-(రా) రాష్ట్రముధరించినవాడు. రాజ-(భా)చంద్రుడు, నికాయము-గుంపు.

రా. సీ॥ పృథివి నేగ్గె (ఘనుఁడు పాండుసమాఖ్యుఁ; డా

జనవరాను) గ్రహమున కనేక

నృపులు వేచెదరు; తదీనసామ్యతే (జందు

నెప్పు డన్న నుడులచొప్పు విడఁడు;)

రమ (కోరిదిగ్విజయముఁ జేసెఁ గుంతిమ

ద్ర) క్షోణివిభుముఖ్యరాజతతుల

మించి, కౌసల్య, సుమిత్ర, కేకయ (ధాత్రి)

ధవతనయనుఁ(మగొనె దయితలుగను)

తే॥ సంతులేక విచారించె స్వాంత, మందు,
శ్రీవిచారించెగురువు వశిష్ఠుతోడ.
ఋశ్యశృంగుఁ దెచ్చి నిజపురికిఁ బురజను
లెలమి మిన్నందఁ బుత్రికామేష్టి సలిపె॥ 20

భా. తే॥ ఘనుఁడు పాండుసమాఖ్యుఁ డాజనవరాను
జుండు నెప్పు డన్ననుడులచొప్పు విడడు,
కోరి దిగ్విజయముఁ జేసెఁ, గుంతి, మద్ర
ధాత్రిధవతనయనుఁ గొనె దయితలుగను॥ 20

టీక॥ పాండుసమాఖ్యుఁడు - (రా) తెల్లనికీర్తిగలవాఁడు. (భా) పాండురాజు. అన్ననుడులచొప్పు - (రా) పలికిన మాటలదారి. (భా) అగ్రజునిమాటలదారిని. ఇనసామ్యతేజుండు - సూర్యునికి సమమగుతేజముకలవాఁడు.

రా. సీ॥ అట్లు సుతేష్టిఁ జే(యు, మునికరుణచేఁ బ
రముని, యుధిష్ఠిరు) రమ్యతేజ
నారాయణునిఁ బద్మనయను, ఘనశ్యాము
(సత్యధర్మగుణము శాంతరసము)
నొప్పు కనికరంబు (నట్టిపను మహాత్ము
నురుశుభాకారుఁ గుం)భీరపుధైర్య
లక్షణు, రాము, సల్లలితుఁ గౌసల్య ధ్ర
(తిఁ గనె ముదము నంద జగము లన్ని)

ఆ॥ పవలు చైత్రశుద్ధనవమిఁ గర్కటలగ్న
మునను భానువారమునఁ బునర్వ
సునను గగనమధ్యమునను సూర్యుండుండ.

నుద్భవించె రాముఁ డుర్విమీఁద॥ 21

భా. ఆ॥ యమునికరుణచేఁ బరముని, యుధిష్ఠిరు,
సత్యధర్మగుణము శాంతరసము
నట్టిపడు మహాత్ము నురుశుభాకారుఁ గుం
తిగని ముదము నంద జగములన్ని 21

టీ॥ యుధిష్ఠిరున్ (రా) యుద్ధమందు స్థిరమగువానిని, (భా) ధర్మరాజును. కుంభిరిపు-సింహముయొక్క-

రా.సీ॥ వి(బుధసందోహము వేడ్క, జెందెను; గనిన్
మోదంబు గో(బృందమున్) నయముగ
వ(సుధ నాశించెడువారు సంతసమునన్
శోభిల్లుచుండంగ, శో)కరహిత
శు(భధరాచక్ర)ము చొక్క, మెల్లన జగ
త్ప్రాణుండునున్ వీచెఁ దా) ఖలచయ
ము (నధమ(శ్రేణియుఁ బొందు చుమ్మలికమున్
ఖ్యాతిన్ విడెం బెల్లుగన్,)సుపర్వ

తే॥ దుందుభులు మ్రోసె దశదిశ లొందెఁ దెలివి,
నలరులజడి గురిసె; నాడి రప్సరసలు;
పాడె గంధర్వతతి; కూర్మితోడ మింట
గరుడపన్నగకిన్నరుల్ గంతు లిడిరి॥ 22

భా.మ॥ బుధసందోహము వేడ్కఁ జెందెను; గనన్ మోదంబు గో)బృందమున్
సుధనాశించెడువారు సంతసమునన్ శోభిల్లుచుండంగ శో
భధరాచక్రము చొక్క. మెల్లనజగత్ప్రాణుండునున్ వీచెఁ,దా
నధమ(శ్రేణియుఁబొందుచుమ్మలికమున్ ఖ్యాతిన్ విడెం బెల్లుగన్

టీక॥ సుధనాశించెడువారు - దేవతలు, జగత్ప్రాణుఁడు-వాయు
దేవుడు, ఉమ్మలికము - దుఃఖము, సుపర్వ-దేవతలు.

రా. చ॥ రణమునజంపు నీ(పరమరాజితుఁడౌ కృతిబంటుభీమురా)
వణుననిషేంగుచుం(బ్రథితభవ్యతఁగూడిప్రభన్ మరుత్తు)లున్
(ప్రణుతసుశీలురుం(దలఁచిరమ్యసుఖంబుముదంబునొంది) మేల్
గణుతినిఁజేయఁగా, (ధృతినిగాంచెనుదత్సతితీవబోఁడి)యున్ 23

భా. తే॥ పరమరాజితుఁడౌ కృతి బంటు భీము
బ్రథితభవ్యతఁ గూడి ప్రభన్ మరుత్తు
దలఁచి రమ్యసుఖంబు ముదంబు నొంది
ధృతినిఁ గాంచెను దత్సతి తీవబోఁడి॥ 23

టీక. రా॥ కృతి - నేర్పరి, భీమున్ - భయంకరుని, మరుత్తులున్ -
సురలు, తత్సతి - కౌసల్య, ధృతినిఁగాంచెను - సంతసమందెను.
భా. కృతిన్-నేర్పరిని. భీము-భీముని, మరుత్తు - వాయుదేవుని,
తత్సతి-కుంతి, ధృతిని-సంతోషముతో, కాంచెను-ప్రసవించెను.
ప్రథిత-ప్రఖ్యాతినొందిన, తత్సతి-(రా) కౌసల్య (భా) కుంతి.

రా. చ॥ వరసుతజన్మమున్ (రమునఁబ్రౌఢుఁడునౌధృతరాష్ట్రుడంత) జా
లరమణతో వినెం, (బలువలక్షణముల్ గలవారినూఱు) నా
యశోవిమలాత్ముఁడున్ (గురుసుయోధనముఖ్యులఁగూర్మితోడఁ) గ
ల్గురసికుఁడర్మిలిం(గనెను,గోస్తులబీవలఁగాంచుఁదన్వి)దాన్ 24

భా. తే॥ రమునఁ బ్రౌఢుఁడునౌ ధృతరాష్ట్రుఁ డంతఁ
బలువలక్షణముల్ గలవారి నూఱు
గురుసుయోధనముఖ్యులఁ గూర్మితోడఁ
గనెను, గోస్తులబీవఁ గాంచుఁ దన్వి॥ 24

టీక॥ రా. పలువలక్షణముల్ ...యురువిమలాత్ముఁడున్-దుస్స్వభావులనుఁజంపు శుద్ధుఁడు - గురుసుయోధనముఖ్యుల - గొప్ప వీరశ్రేష్ఠుల, అర్మిలిం గనెను - సంతస మందెను. (భా) నూఱుగురు - శతము, సుయోధనముఖ్యుల - దుర్యోధనుఁడు మొదలగువారిని, కనెను-కలిగినవాఁడయ్యెను. ధృతిరాష్ట్రుఁడు-(రా) రాష్ట్రముధరించినవాడు, దశరథుడు.

రా.చం॥అతిముదితాత్మునై(మఱియు చర్మిలిచేమినుముట్టి యూని) శత్

హితమతి కైకయుఁ (శితశరేక్షణ గాంచెను జిష్ణుసత్క) శౌ
యుతుఁడగువాని, దా(రుణరిపూర్జ్వలభంజనరూక్షతేజుఁ) బ్రి
స్తుతు,భరతున్,మహా(విజయుశోభితలక్షణు, వేల్పులెన్నఁ)గన్

భా॥గీ॥ మఱియు చర్మిలిచే మినుముట్టి యూని
శితశరేక్షణ గాంచెను జిష్ణుసత్క-
రుణ, రిపూర్జ్వలభంజనరూక్షతేజు,
విజయు, శోభితలక్షణు, వేల్పులెన్న॥ 25

టీక॥ రా. జిష్ణుసత్కశౌయుతుఁడగువాని - జయశీలుని తేజము గలవాని, మహావిజయుశోభితలక్షణు - గొప్పగెలుపుకాని యొక్క ప్రకాశమానమగు స్వభావముగలవానిని, భా॥ ఆసశితశరేక్షణ-కుంతి, జిష్ణుసత్కరుణ-దేవేంద్రుని దయవలన, విజయు-అర్జునుని.

రా॥సీ॥ రాజీవపత్రనేత్ర సుమిత్రయును (బాధ
భవ్యతఁ గాంచె బ్రిభాయుతుని న)
తశరోధి (కులుని నుతదివిజు ముదితకు
వలయు సహా) సాంశుభాసమాను,

లక్ష్మణు, శత్రుఘ్ను, లాలితభూ (దేవు;
దివ్యరుచికలితు, ధృతిని నెన్ని)
కకునెకుట- మోహనాకారులునా (స్వర్గ
వైద్యులమాద్రి) సుపర్వవినుత)

ఆ॥వే॥ లలితరూపులయిన లక్ష్మణశత్రుఘ్ను
లుద్భవంబు నొంది రుర్విఁ బగలు;
వరునఁ జక్రశేషపాంచజన్యములై త
గ భరతుఁడు సుమిత్రికందులయ్యె॥ 26

భా॥గీ॥ బాధభవ్యతఁ గాంచెఁ బ్రభాయుతుని న
కులుని, నుతదివిజు ముదితకువలయు, సహ
దేవు, దివ్యరుచికలితు ధృతిని నెన్ని
స్వర్గవైద్యుల, మాద్రి, సుపర్వవినుత॥ 26

టీక॥ రా॥ నతవిరోధికులుని-వంగినశత్రుసమూహముగలవానిని
సహస్రాంశుభాసమాను - సూర్యతేజస్సుగలవానిని, స్వర్గ
వైద్యులమాద్రి-ఆశ్వినులవలె, (భా) మాద్రి - మాద్రీదేవి
స్వర్గవైద్యుల - ఆశ్వినులను, ఎన్ని - ప్రార్థించి. పాంచ
జన్యము-విష్ణుని శంఖము, కందులు-కుమారులు,

రా॥ చ॥జగతివిభుండు సద్ (హాసననంయుతుఁడై ధృతినంత
మాద్రి)న
పుడ్గనఁగ లేదనెఁ;(మమతఁబొందె,మహీసురుమాటనాజ్ఞ)నా
వగ యఁనె భూపుఁడుఁ (ధవుఁడుఁబొందుసమాఖ్యుఁడు;
తత్సుకీర్తి)తో
నగరియువెల్గె, రే(యఁతివ నాధుని రాజును హాళిఁగూడె)నాన్ 27

భా॥గీ॥ హవనసంయుతుఁడై ధృతి నంతమాద్రి
మమతఁ బొందె, మహీసురుమాట నాతె
ధవుడుఁ బాండుసమాఖ్యుఁడు; తత్సుకీర్తి
యతివ నాథుని రాజును హాళిఁ గూడె॥ 27

టీక॥రా॥ ధృతినంతమాద్రి - అంతకు సామ్యముగునంతసమును
భా॥అంత - అంతట; మాద్రి - మాద్రీదేవిని, ఆతె - చని
పోయెను. పాండుసమాఖ్యుఁడు - రా. తెల్లనికీర్తిగలవాఁడు
భా. పాండురాజు. తత్సుకీర్తి-ఆ శోభనమగుకీర్తిగలదియగు,
అతివ-(స్త్రీ) అనగా మాద్రి రాజును-(రా) చంద్రుని, (భా)
పాండురాజును, మాట - (రా) దీవన; (భా) శాపము
హాసన-నవ్వు, (సంతోషముచేత)

రా॥చతుర్విధకందము. సీతిగ దివిజవితానము
భాతిన్, ఘనకేసరిశిశువర్గం బనగా,
భూతకరుణాత్ములనియెడి
ఖ్యాతిన్, జననాథసుతనికాయము దనరెన్॥ 28

భా॥కం॥ ఘనకేసరిశిశువర్గం
బనఁగా భూతకరుణాత్ములనియెడు ఖ్యాతిన్,
జననాథసుతనికాయము
దనరెన్ సీతిగ దివిజవితానముభాతిన్॥ 28

"భూతకరుణాత్ములనియెడు" నుండియు, "జననాథసుతనికాయము" నుండియుఁ, జదివినను కందపద్యములు వచ్చును.

టీక॥ వితానము, వర్గము, నికాయము-గుంపు.

రా॥చ॥ అతులితవిక్రమలై(పెరిగిరాపరిభుప్రతురిలు వీఁకగూడ;) బ
ర్వతధృతిఁ దండ్రి తా (నధికకౌరిచమూవధిహరికుంభ) జం

డతిశ్రుతిఁ జూడ, రా(జదయనంచుచు నేర్చిరి క్షాత్రవిద్య) లం
దతమగు నేర్పుతో; (నవనిఁ దామరతంపర లైరి చాల)గఁ॥29

భా॥గీ॥ పెరిగి రాప్రభుపుత్రులు పేఁక గూడఁ;
నధిక వైరిచమూదధిహారి కుంభ
జదయ నందుచు నేర్చిరి క్షాత్రవిద్య;
నవనిఁ దామరతంపర లైరి చాల॥ 29

టీక॥ రా. అధిక వైరిచమూదధిహారికుంభజుడు-గొప్ప శత్రుసే
నాసముద్రమునకుమనోజ్ఞుఁడగు నగస్త్యుని బోలువాడు.
భా.అధిక వైరిచమూదధి-గొప్పశత్రుసేనాసముద్రమును,
హారి - హరించువాడగు, కుంభజదయ - ద్రోణునిదయ.
పేఁక-పరాక్రమము, తతము-విరివియైన, తామరతం
పరలగుట-వృద్ధిజెందుట.

రా॥సీ॥ అభివృద్ధినొందెఁ జేయఁగ దైత్యులు (కడఁగ
ను నసూయ దుర్యోధనుఁడునుఁ బొందు)
యశుఁడగు రాముండు; కౌశికతనూజుండు
పగను మారీచసుబాహుముఖ్య
ఘనవిజయజ్ఞవిఘ్నకరదితిసుతుల
పైఁ గని, యేగి, భూపతిని, వారి)
గూల్ప రాఘవుఁ (బంపఁ గోరెఁ బవిత్రంబు
వారణావ)త్రి సింహవర్గ మాడు

ఆ॥ కొనుస్వనవతి (తతలముగను, పేఁగియునుఁ దు
దఁ ననువంగ) నీయకొనె నితండ
తులితుఁ డుత్కటునక నిల్పు నీరగు లేల
యనుపుమని వశిష్ఠుఁడు నుడువంగ॥ 30

భా.గీ॥ కడుగను నసూయ దుర్యోధనుఁడునుఁ బాండు
సుతులపైఁ గనియేగి, భూపతిని వారిఁ
బంపఁ గోరె బవిత్రంబు వారణావ
తతలమునకు, వీఁగియును దుద ననుపంగ॥ 30

టీక॥ రా.దుర్యోధనుఁడు - యోధులకు భేదింపరానివాఁడు, పాండుయశుఁడు- తెల్లనికీర్తిగలవాఁడు, వారణావళి... తతలమునకు-జాతివైషమ్యములనుగూడ మఱచి, విశ్వామిత్రివిపరిభావముచేత నతనియాశ్రమమునందు నేనుఁగులు సింహములాడుకొనుచున్నవనుట. భా. పాండుసుతులపైన్-పాండవులపై, వారణావతతలమునకు - వారణావతమను స్థలమునకు. ఉక్కు-తునుక - పరాక్రమముగలిగినవాడనుట, వ్యసవతత తలము - తన యజ్ఞముచేయు విశాలమగుచోటు.

రా.చ॥ ప్రణుతులఁ జేయుచున్ (నృపతిపాండుసమాఖ్యజు లెచ్చ రామ) ల
క్ష్మణులు నొనర్చిసన్ (మృదులమంజులగాత్రిసమేతమాత)లం
గణుతి, మునీంద్రుతో (నెపసి కాండములం గొని రేఁగి రంతఁ)ద
త్క్షణమున, గంగనుం (గనిరి క్ష్మాపజు లెత్తెఱగా మదంబు)నన్॥

భా.గీ॥ నృపతి పాండుసమాఖ్యజు లెచ్చ రాము,
మృదులమంజులగాత్రిసమేత, మాత
నేఁసి, కాండములంగొని, యేగిరంతఁ
గనిరి క్ష్మాపజు లెత్తెఱగా మదంబు॥ 31

టీక॥ నృపతి పాండుసమాఖ్యజులు - (రా) రాజగు, తెల్లని కీర్తిగలవాని(దశరథుని) కుమారులు (భా) పాండురాజ

పుత్రిలు, కాండములు.. బాణములు, ఎక్తైఅ - ఎక్కువ, ఎచ్చు-హెచ్చు.

రా.చం॥ కసనది దాటి తన్ (మృదుసుభద్రయశస్కులు
హెచ్చులక్క-) డన్
మసలు, చెడారియగా (నెలవు నవ్యముదంబుజనించుచుండఁ)గా
నసురనుఁదాటకం (గనిరి, హాళిసిదానిని గండడై స)రిన్
వెన శరవహ్నినై (రిక్రుతిభీముఁడు రాముఁడు ప్రీతిఁగాల్చెఁ)
దాన్॥ 32

భా గీ॥ మృదుసుభద్రయశస్కులు హెచ్చులక్క
నెలవు నవ్యముదంబు జనించుచుండ
గనిరి; హాళిసిఁ దానిని గండడై స
రి క్రృతి భీముఁడు రాముఁడు ప్రీతిఁగాల్చె॥ 32

టీక॥ రా॥ నైరిక్రుతిభీముఁడు-నేర్పరులగు శాత్రవులకు భయంకరుఁడు. (భా) సరిక్రృతి- సరియగు నేర్పరి. రాముఁడు-రమ్యముగానుండువాఁడు హెచ్చులక్క నెలవు గొప్పలక్క యిల్లు.

నిరోష్ఠ్యము.

రా॥గే॥ (జతఁగనని దిట్ట లాఁలి తతి నెఱిసరి
హాళి దాని దాటిరి; లలి నాయతధృతి
రహిసఁ జనిరి సంతతసాశరధరణి కధ
కతతతలి కచటన్) జాల ధృతినెలసిరి॥ 33

భా॥కం॥ జతఁగనని దిట్ట లాఁలి
తతి నెఱిసరిహాళి దాని దాటిరి; లలి నా
యతధృతి రహిసిఁ జనిరి సం
తతసాశరధరణి కధికతతతలి కచటన్॥ 33

తెం. అలలితతిఁ - అసాంగత్యైన సమయమందు, నెఱిసరిహాళి - ఎక్కువయుక్తముగాను ప్రీతిత్రోఁడ, లలిఁ - విశాపముగా, నాయతధృతిఁ - ఎక్కువధైర్యముతో, రహిని - రంజనముగా, సాశరధరణిఁ-రాక్షసులతో గూడినభూమికి, రా॥ ధృతినెలసిరి-ప్రీతినందిరి, దాని-(రా) తాటక, (భా) లక్కయిల్లు అధికతతతలికి-ఎక్కువవిశాలమగుచోటు.

రా॥సీ॥ విహగనాథుఁడు శత్రు(భీముఁ డెచ్చయి కెడ
పి పరు మహాహిం డి(దుపడక మిగు
లుగతి రాముఁడు దీర్చెఁ బగ నని మౌని గొన
(బుధృతిఁ గూడెఁ; దదనుజధృతిఁ గాంచె)
జటికోటి భూపాగ్ర(సత్సుతుఁ గని యేక
చక్రపురము మాధుర్యరిక్రమసుచ
రితదూరఖలులఁ హరింపదె పెక్కు మా
ఱు లటులను రఘువరునిప్రతాప

గీ॥ మొక్కటే చాలు దనుజుల నుడుప ననిచు
దారిలోఁ, గూర్మిఁ జూచెనా తాపసాధి
కని(కరము నృపజులు ద్విజగతుల; నెఱపఁ)
గ సవము ముని చెఱుపవచ్చి రసురు లపుడు॥ 34

భా॥ఆ॥ భీముఁ డెచ్చయి కెడపి పను మహాహిడిం
బు ధృతి, గూడెఁ దతనుజ ధృతిఁ; గాంచె
సత్సుతుఁ; గని యేకచక్రపురను మాధు
కరము నృపజులు ద్విజగతుల నెఱప॥ 34

టీక॥ రా, శత్రుభీముఁడు-విరోధులకు భయంకరుఁడు, మహాహిఁ-గొప్పపామును, గొనబుధృతిఁ - మనోజ్ఞమగు సంతస

మును, తదనుజధృతిన్-అతనితమ్మునియొక్క (లక్ష్మణుని) ధైర్యమును, నేకచక్రపురము-ఒక్క (విష్ణు) చక్రముయొక్క భాగ్యమే. ద్విజగతులన్-పక్షులగమనమును, భా. హిడింబు-హిడింబుండను రాక్షసుని, ధృతిన్ - ధైర్యముతో, తదనుజన్ - అతని చెల్లెలగు హిడింబిని, ధృతిన్ - సంతోషముతో, ద్విజగతులన్ - బ్రాహ్మణులవిధముతో, సత్సుతు - ఘటోత్కచుని, విహగనాథుడు-గరుత్మంతుడు, జటికోటి-మునులగుంపు.

రా.ఉ॥ ఔచితి రాముఁడున్(మురసి యుచ్ఛ్రితశిష్టులు పొంగఁగా
బ)లున్
నీసుబాహు సో(కు ధరణీజనదూరుని(గూర్కుఁ గూల్చె,)మా
రీచుని(జిమ్మె సద్ (ధృతి వరించి కడన్ గడిఁ దేఁచె భీముఁ)డై,
శారిచ సవమున్ గో(డడలు బొందుచు దుష్టజనాళి కుంద)గన్॥

భా.గీ॥ మురసి యుచ్ఛ్రితశిష్టులు పొంగఁగా బ
కు ధరణీజనదూరునిఁ గూర్కుఁ గూల్చె,
ధృతి వరించి కడన్ గడిఁ దేఁచె భీముఁ,
డడలుఁబొందుచు దుష్టజనాళి కుంద॥ 35

టీక॥ రా. భీముఁడై-భయంకరుఁడై. సోకు-రాక్షసుని, గోడు-దుఃఖము, అడలు-భయము.

రా.ఉ॥ పొంగు చొరన్ ధ్రువ సద్(ధృపులు భూపసుతుల్ సుధృతిన్
మహాద్రి)లై
భంగము దాపసా(పద, కృపాలజ వారిజపాద కృష్ణ) సా
రంగమృగాక్షియా(రమణి పెమ్పు సుభాస్వతి రసత్ప్రకోందు) నే
రాగవ జానకీ(పరిధిత హస్తకపాణివివాహ మందు)నన్॥ 36

భా.గీ॥ నృపులు భూపసుతుల్ సుధృతిన్ మహాద్రి

పదనృపాలజ వారిజపాద కృష్ణ
రమణి రమ్యశుభాస్యతిరస్కృతేందు
పరిధితహల్లకపాణి వివాహమంచు॥ 36

టీక॥ రా. సుధృతిక్ష్మామహాధ్రులై - ధీరత్వమున గొప్పపర్వతములఁ బోలినవారై; కృష్ణసారంగమృగాక్షి-కృష్ణసారంగమువంటికన్నులుగలది, భా. ద్రుపదనృపాలజ - ద్రౌపది; కృష్ణ - కృష్ణయను పేరుగలది, ఆస్యతిరస్కృతేందు-ముఖముచేతిరస్కరింపబడిన చంద్రుడుకలది, హల్లకపాణి-చెంగలువవంటి చేయికలది

రా.గీ॥ (విని యతిసునృపజులు విరివిధృతిఁ దలఁచి
రా వివాహమునకుఁ బోవ హాళి,) ధీమ
(తల్లి తోడుత ఘనతనుఁ దనరి చనిరి
కానఁ గూర్మిఁ గోడఁ గలయఁగనుచు) గనుచు॥ 37

భా.ఆ॥ విని యతిసునృపజులు విరివిధృతిఁ దలఁచి
రా వివాహమునకుఁ బోవ హాళి;
తల్లితోడుత ఘనతనుఁ దనరి చనిరి
గానఁ గూర్మిఁ గోడ గలయఁగనుచు॥ 37

టీక॥ యతిసునృపజులు-(రా) యతి-ముని. సునృపజులు-శ్రేష్ఠులగు రాజకుమారులు, (భా) అతి - అధికమగు, సు-శ్రేష్ఠులగు, నృపజులు - రాజకుమారులు, ధీమతల్లి - శ్రేష్ఠమగు బుద్ధి. విరివిధృతి-ఎక్కువగు ధైర్యము, హాళి-సంతోషము.

రా.సీ॥ ఆవనశోభను నతిమోద మెసఁగ (గంగఁ
గన్నులారన్ వారు గాంచి; రచట)
నంబురుహహితాన్వయాంబునిధిశశి (భూరి

వీరుండు జిష్ణుఁ డంగారపర్ణ)
సదృశ తామ్రాక్ష్యుండు క్ష్మాజారుచిర (శక్తి
జాలఁ గామించెఁ బ్రచండపుఁదమి)
గౌతమాశ్రమము దగ్గరి రంతట (ననల
సానందభగిత్రాత్ము లయిరి వారు;
అ॥ రామచంద్రపాదరజము సోఁకినయంత
శాపవశముచేతఁ జట్టయిన య
హల్య పూర్వరూప మందె నచ్చోటువాసి
వారు మిథిలతోటఁ జేరి రచట॥ 38

భా.గీ॥ గంగఁ గన్నులారన్ వారు గాంచి రచట
భూరివీరుండు జిష్ణుఁ డంగారపర్ణ
శక్తిఁ జాలఁగా మించెఁ బ్రచండపుఁదమి,
ననలసానందభగిత్రాత్ము లయిరివారు॥ 38

టీక॥ రా. అంగారపర్ణము-అగ్నిశకలములు గలయాకు(ఎఱ్ఱని) జిష్ణుఁడు-(రా) జయశీలుఁడు భా. అర్జునుఁడు, తమి-(రా) కోరిక, (భా) రాత్రి, తామ్రము-ఎఱ్ఱని, ఓష్ఠ్యుండు-పెదిములుగల వాఁడు, (రా) చాల, కామించె, (భా) చాలగా, మించె, అనలస-మ దముకాని.

ముక్తపదగ్రస్తము.

రా.సీ॥ ఘనమనశ్యాము రాఘవునిఁ గాంచి (మురిసి
పురివిప్పియాడు కొమరునెమిళ్లు)
ననలియాట కనుగుణ్యపుటలల, (నలల
యందుమ్యోలల నూఁగు నంచలగమి,)
నంచలగమి వెక్కిరించు మజికి (వల్ల

రుల లీలనూఁగెడు బలితకపుఁ(
గపితతిచేత మెక్కఁబడు పండ్లనుఁ (బండ్ల
బరువునఁ దలలను వంచు చెట్లఁ)

గీ॥ జెట్లకొమ్మల నెఱుపుఁజేసెడు చివుళ్లఁ,
జివురులఁ దిని క్రొవ్వి పలుకు చిలుకపౌజు
చిలుకపౌజున కులుకు జింకల గలిగి క
ర మలరించె నారామ మా రామముఖుల॥ 39

భా.గీ॥ మురిపి పురివిప్పియాడు కొమరునమిళ్ళ
నలల యందుయ్యేలల నూఁగు నంచలగమి
వల్లకుల లీలనూఁగెడు బలితకపుఁ
బండ్లబరువునఁ దలలను వంచు చెట్ల॥ 39

టీక॥ భారతమందుఁ గ్రింది పద్యమున కన్వయము. నమిలి – నెమలి, అంచలగమి – హంసలగుంపు, వల్లకులు – తీగలు, ఆరామము – వనము, రామముఖుల – రాముడు మొదలగువారికి.

అష్టవిధకందము.

రా. ద్రుమములఁ గరులనుఁ జెలికుసు
మములను ఘనతఁ గుశలతను మఱి మఱి కనుచుఁ
సమరహితరమ్యమును ఖలముల
గుములయి తనిసి రతులితులు గురుమతివినుతుల్॥ 40

భా. చెలికుసుమములను ఘనతఁ గు
శలతను మఱి మఱి కనుచును సమరహితరమ్య
ఖలముల గుములయి తనిసి గ
తులితులు గురుమతివినుతులఁ ద్రుమములఁ గరులఁ॥ 40

"టీక. సులభము ఇక్తే "ఘనతఁ గుశలతను" "నుండి మతి
మతి కనుచును" నుండి "సమరహితరమ ను" నుండి, ఖలముల
గుము లయి" నుండి, "తనిసి రతులితులు" నుండి, "గురుమతి
వినతులు" నుండి చదువ వచ్చును. అక్ష్రకవీయమున నష్టవిధ
కందమున కీయబడిన లక్ష్యప్రకారము, "కనుచుఁ-కనుచును
గాను, రమఁ-రమనుగాను, గుములై-గుములయి గాను, విను
తులే-వినుతులుగాను రావచ్చును (ద్రుమముల-చెట్లను, వెలి
కుసుమములు-తెల్లని పుష్పములు ఖలము-చోటు.

రా గీ॥ (పరఁగఁ జిగురాకుచేతుల గురుపుగ శ్రీము
వాయ విసరెఁ గొమ్మలపరి; భాసురముగ
ద్విజగవముల మధ్య రహిన్ సృపజలపయి ర
మ నలరులు నొలసెఁ,) హెచ్చె మంజులతలు॥ 41

భా.కం॥ పరఁగఁ జిగురాకుచేతుల
గురుపుగ శ్రీము వాయ విసరెఁ గొమ్మలపరి; భా
సురముగ ద్విజరవముల మ
ధ్య రహిన్ సృపజలపయి రమ నలరులు నొలసెన్॥ 41

టీక. రెంటికి సమము. చిగురాకుచేతులఁ - చిగురులను
చేతులతో, కొమ్మలపరి-వృక్షశాఖల గుంపు, ద్విజరవములు-
పక్షుల పలుకుల, అలరులు-పుష్పములు, మంజులతలు-సుంద
రములగు తీవలు. చిగురాకుచేతుల-చిగురులవంటి చేతులతో,
కొమ్మలపరి-స్త్రీసమూహము, ద్విజరవములు - బ్రాహ్మణుల
పలుకులు (మంత్రములు) అలరులు నొలసెఁ-సంతోషములు
వ్యాపించెను; మంజులతలు - మనోహరత్వములు. అని అర్థాం
తరము. ముందుకాఁబోవు వివాహమునకు సూచనలు.

అచ్చతెలుఁగు.

రా.చం॥ పసివడి దిట్టలై (పరఁగ వచ్చిరి వీటికి వారు రాచ) చె
లువ్వైన రగనంత రా (కొమరు; లొక్కొక్కరుండును గొప్ప
వేడ్కఁ) బెం
డ్లినగుదు నేనె బల్ (గొనబు నేర్పరి పెండిలికూతుఁరన్న) నం
చనుకొని రెచ్చునై (పొరలి హాళియుఁ గోరిక పుట్టుచుం
డఁ) గన్॥ 42

భా.గీ॥ పరఁగఁ వచ్చిరి వీటికి వారు రాచ
కొమరు లొక్కొక్కరుండును; గొప్ప వేడ్క
గొనబు నేర్పరి పెండిలికూతురన్న
పొరలి హాళియు గోరిక పుట్టుచుండ॥ 42

టీక. పెండిలికూతురన్న - (రా) సీతయనుచో, (భా) ద్రౌపది యగ్రజుఁడు. భారతమునఁ గ్రిందిపద్యమున కన్వయము. పసివడి-ఎక్కువ, గొనబు-మనోజ్ఞము.

రా.చం॥ జనకుఁడు సాకుమన్ (నుడివె క్షాత్త్రజులార విఱుంగు
చోఁట) డా
లునహితువిల్లు బెం (గుఱిని లోఁగొని; బీరము గూడ, దాని) పు
ల్లనలిననేత్ర సై (నయనలక్ష్యము వేసిక నాటఁగొట్టి) చుం
దనరుచి నెక్కుడున్ (మెఱసి, తప్పకుండం గొనుమిందుఁబోఁడి)
నిన్॥ 43

భా.గీ. నుడివె క్షాత్త్రజులార విఱుఁగుఁ జోఁట
గుఱిని లోఁగొని బీరము గూడ దాని
నయనలక్ష్యము వేసిక నాటఁ గొట్టి
మెఱసి తప్పకుండఁ గొను మిందుబోఁడి॥ 43

టీక. రా. చోఱడాలు-మీనకేతనుఁడగు మన్మథునియొక్క-అహితు-శత్రుఁడగు శివుని, లక్ష్యము - గుఱి, వేడుకనాటఁగొట్టుచున్, (రా) సంతోషమును నాటుకొలినిఁ గొట్టుచు. భా. వేడుకనాట-సంతసము నాటగా, దానియనలక్ష్యము - చేరుకన్నను గుఱిని. కొట్టు. మించుబోఁడి-మెఱుఁగువంటి శరీరము కలది.

రా. చం॥ అన (విని, శౌరి, కొందరు వరావనినాథజు లోడి, సిగ్గుపైఁ
గొనఁ జనిరం) తటన్ వివచి; కొందఱు గుందిరి కొందలాన, బలు
మన (తనుఁ గొందఱాసనములన్ ఘనభాతిని నుండి రంత గ్ర
మ్మఁ ళుకునన్;) రోదంగనక పోయిరి కొందఱుబుద్ధిమం
తులున్॥ 44

భా. కం॥ విని, శౌరి కొందఱు వరా
వనినాథజు లోడి సిగ్గుపైగొనఁ, జని రం
తనుఁ గొంద ఱాసనములన్
ఘనభాతిని నుండిరంత గ్రమ్మఁ ళుకునన్॥ 44

టీక. కొందలము - దుఃఖము, అళుకు - భయము ఘనభాతి - గొప్పరీతి.

రా. చం॥ ఇనసమ తేజుఁడన్ (బిరుదు నేనను నోరిమి, బిట్టుమా
య) నన్
జనకుఁడు క్రూరుఁడుం (గుమతి నల్పనటంచును గొంద
అంత) టం
బనివడిశిన్కతో (నవిరి; నలిగ్గి కొందఱు నక్క నీవె) యె
ఘనుఁడగునాకునన్ (గతియె? కాక వివాహము కాదె
యుం దు)నన్॥ 45

ధరణి వానిది కానిది దర్ప, జేల
నవ్వుల దీనికి లోపడ నాన లేక॥ 47

టీక. ఏడు - ఎవడు, సర్వవిదుడు - సర్వము తెలిసిన భగవం
తుడు, తివుకుట-కోరుట, నాన-సిగ్గు,

రా.గీ. (అని యనిరి కొందఱున్నృపజు లనుకొని రెద
గెలువ రేరు నంచును మఱి గెల్చిన భుజ
బలమున నని యందునఁ గూల్చి పడఁతిఁ గొనెదె
మనుచుఁ గొందఱు వే) సతిఁ గనుగొనుచును। 48

భా.కం. అనియనిరి కొందఱు న్నృపజు
లనుకొని రెద గెలువ రేరు నంచును మఱి గె
ల్చిన భుజబలమున ననియం
దునఁ గూల్చి పడఁతిఁ గొనెద మనుచుఁ గొందఱు వే॥ 48

టీక. ఏరు-ఎవరు, అని-యుద్ధము.

రా.చం॥ రవినను తేజుఁడున్ (బలుఁడు రాముఁడు జిష్ణుఁడు వచ్చి, వీఁక) బ
ల్మి వెలయు శౌర్యముం(గ)బలువ లీలనుఁ (ద్రుంచెను బంచసాయ)కా
రివిలునుఁ దోమపా(కముల శ్రీ)మెఱయం దెఱగంటిమిన్న)లు
బ్బ, వఱలు సిగ్గుతోఁ) దలలు వంచఁగఁ దక్కన ధాత్రిపాళి)యుఁ॥

భా.గీ॥ బలుఁడు రాముఁడు జిష్ణుడు వచ్చి వీఁక
బలువ లీలనుఁ ద్రుంచెను బంచసాయ
కముల శ్రీ మెఱయం దెఱగంటిమిన్న,
దలల వంచఁగఁ దక్కన ధాత్రిపాళి॥ 49

టీక. పంచసాయక-మన్మథునియొక్క, అరి - శత్రుఁడగు

రా. చం॥ జలజజలధిమీఁదఁగా(వెస లసద్విసజాసన వేసయాసఁ)దా
నలిమిఁ జేఁ దాటి క్రాల్ (మనము వల్లన వైచెను మానుగా
ను) ఖ్యా
తి రసరమన్ రహిన్ (నతిధృతిన్ బతియొప్పిన నాన నాన) తో
నరవరపేరతం(బొనరి నల్వ్యనఁదావుల పూలమాల)నన్॥ 51

భా. గీ॥ వెస లసద్విసజాన వేసయాన
మనము వల్లన వైచెను మానుగాను
నతిధృతిన్ బతియొప్పిన నాన, నానఁ
బొనరి నల్వ్యనఁ దావులపూలమాల॥ 51

టీక. రెండిటికి. నయాన-నయముతో, పతియొప్పిన-భర్తకంఠసీమను. ఆనర-తగులునట్లు, రా. నతిక్-క్రమొక్కుటతో (భక్తిభావముతో) ధృతిక్-సంతోషముతో, భా. అతిధృతిక్-ఎక్కువసంతోషముతో, నరవరపేరతన్-(రా) రాముని యొక్కయుత్సాహముచే, వెస-వేగముగా, అలిమతి-సంభ్రమముతో, తాఁటి-అడగి, మనము,అల్ల అన, మాను గాను-అందముగ రహి-ప్రీతి, తావుల-వాసనలుగల.

రా. సీ॥ వచ్చిరి దశరథపతియు నా(పాండుస
మాఖ్యునిపుత్రు)లు మహితభరత
శత్రుఘ్నులును; మెండుసరినిఁ గొనిరి కృష్ణ
మృగనయనను వ్యాఘ్రశమేచకజట
నుర్వీజ రఘురాముఁ డూర్మిళ లక్ష్మణుం
డును మాండవి భరతుఁడు శ్రుతకీర్తి
శత్రుఘ్నుఁడు శుభాల్ పన గురుండన(సుండ
నఁ; బిలుగఁగ ధృతరాజ్యబలునికొడు

గీ॥ కులనఁ గోడండ్రఁ గన నొండొరుల సతులు, స్త్ర
పజులు కోసలరా(ష్ట్రిం)డు స్వపురికిఁ జని
రలరుచు రుచిరగతితో)డ సులువుగ భృగు
రాముగర్వంబు దారిలో రాముఁ డడఁచె॥ 52

భా.కం॥ పాండుసమాఖ్యునిపుత్రులు
మెండుసదిని గొనిరి కృష్ణ మృగనయనను వ్యా
సుం డనఁ, బిలువఁగ ధృతరా
ష్ట్రిండు స్వపురికిఁ జని రలరుచు రుచిరగతితో॥ 52

టీక. పాండుసమాఖ్యుని - (రా) తెల్లనికీర్తిగలవాని, (భా) పాండురాజుయొక్క, కృష్ణమృగనయనను - (రా) కృష్ణమృగమువంటి కన్నులుగలదానిని, (భా) కృష్ణన్-ద్రౌపదిని, మృగనయనను-లేడివంటి కన్నులుగలదానిని, శుభాళ్ - (రా) శుభవచనములు, అన-(రెంటికి) చెప్పఁగా, వ్యాళ మేచకజట-పాము వంటి నల్లని జడగలది, భృగురాముడు-పరశురాముడు.

రా.సీ॥ (పాయక మించఁగా స్వపురి వాకు కడున్, రు
చిస్ఫూర్తియుక్తుఁడై) (శ్రీదలంచె
(న్యాయపథానమున్న జననాయకుఁడుం గృ
తిస్తుత్యుఁడర్థ భూ)తికలితారి
(ధీయుత రాజుగా ధృతి యుధిష్ఠిరు సన్మ
తి(శ్రేష్ఠు రాముని)ధీరగుణుని
(జేయఁగ, దుష్టులన్) సిలుగుఁ జెందిరి దుష్ఠి
తిఖోభఁ గూడుచుకా, దిట్టయయి పు

గీ॥ భస్యశ్రీఘమన్నని నృపుఁడు పలికెఁ బురజ
నులకుఁ దనకోరికా, వారియనుజ్ఞఁ బొందె,

నొకటి తానెంచ దైవ మింకొకటి సేయుఁ
గాని యద్దానిఁ గలఁ గాంచఁ గలఁడె నరుఁడు॥ 53

భా. ఉ. పాయక మించఁగా స్వపురి వారు కడున్ రుచి, స్ఫూర్తి యుక్తుఁడై
న్యాయపథానమిన్న జననాయకుఁడుం గృతి స్తుత్యుఁ డర్థభూ
ధీయుతరాజుగా ధృతి యుధిష్ఠిరు సన్మతి శ్రేష్ఠు రాముని౦
జేయఁగ, దుష్టులున్ సిలుగుఁ జెందిరి దుస్థితి క్షోభఁ గూడుచున్॥

టీక. రుచిస్ఫూర్తియుక్తుడై- ఒకేసమాసము. (భా) రుచిన్, స్ఫూర్తియుక్తుఁడై - ఇట్లే కృతిస్తుత్యుఁడు. సన్మతిశ్రేష్ఠుఁడు, దుస్థితిక్షోభ - ఒకేసమాసము. (భా) వేఱుపదములు. ఇందు సీసోత్పలమాలలలో నాలుగుపాదములయందు 15 వ యక్షరములగు 'చి' 'తి' 'తి' తిలు రామాయణార్థమునగురువులుగాను, భారతార్థమునలఘువులుగానున్నవి. కృతిస్తుత్యుఁడు-(రా) కృతులవలన స్తుతింపదగువాఁడు. (భా) కృతియు, స్తుత్యుఁడు. అర్థభూతికలితారి-(రా) తుచ్ఛములయిన ఐశ్వర్యములుగల శత్రువులు గలవాఁడు. అర్థభూధీయుతరాజు - (భా) సగము రాజ్యమునకు బుద్ధిప్రావీణ్యముగలరాజుగాన్ యుధిష్ఠిరు - (రా) యుద్ధమందు స్థిరముగువానిని రామున్-(భా) రమ్యముగువానిని.

రా. సీ॥ ఇల (ఖ్యాతి, స్ఫూర్తియుతైణీలోచనల సత్
ఘ్నాపాత్మజుల్ గొప్పగాఁ) గొని (ప్రియ
ముగ (నీతిశ్రేయపు బుద్ధి నేను గలయన్
ధీశోకార్క-కంఠమున్ ధృతిక్) సుకృతము
లెద. (ప్రీతి ప్రజ్వలితేచ్ఛ సల్పిరి జనుల్
పేర్మిం గనంగా లలిం), గనుఁగనుఁ,

రా.చం. అని పెవశిష్ఠపద (ద్విజుని కై; సమయ మొక్కవేళ
దప్పి)కా
యన కని స్వేచ్ఛ వా(విజయుఁ; డగ్రజసమ్మతిఁ (బీతిభూమిఁ)జే
కునిఁ గొని కెమ్మి నెం (దనరి సుభ్రత నేఁడు; ప్రదక్షిణించి)బం
టుచు రఘురాముతో (గామనున్ మరలం జనె గారవ మెచ్చఁ)
గన్॥ 55

భా.గీ. ద్విజుని కై సమయ మొక్కవేళఁ దప్పి,
విజయుఁ డగ్రజసమ్మతిఁ బ్రీతి భూమిఁ
దనరి సుభ్రత నేఁడు ప్రదక్షిణించి
గామనున్ మరలం జనె గారవ మెచ్చ॥ 55

టీక. సమయము (రా) కాలము (భా) ఒడంబడిక, విజయుఁడు (రా) జయశీలుఁడు (భా) అర్జునుఁడు. అగ్రజసమ్మతి-(రా) బ్రాహ్మణుండగు వశిష్ఠునిసమ్మతిని, (భా) అన్నయగు ధర్మరాజుసమ్మతిని, నేఁడు- రా) రాజు, ఏఁడు - (భా) సంవత్సరము. భూమిజేసుని-రాముని: గారవము-ప్రేమ, ఎచ్చన్-హెచ్చగ.

రా.చ. ఘనతభటుంతుమేలి (నియతిగ్రమ్మఱ వారిజ నేత్రు
కృష్ణు)రా
ము నిస్పృహభవ్యు(స్థలికిఁబోయి కడంక వెసన్ సుభద్ర)స
జ్జనను రాఘవుం (గొనుచు సమ్రుచి వచ్చెను; గూర్మి
నాత్మ) లం
గను చకుదెంచె నా(పురికి రమ్యతలనాసులమూఁ(క
మూడఁ) గన్ 56

భా.గీ. నియతి గ్రమ్మఱ వారిజనేత్రు కృష్ణు
స్థలికిఁ బోయి కడంక వెసన్ సుభద్రఁ

గొనుచు సదుఁచి వచ్చెను గూర్మి నాత్మ
పురికి, క్ష్మాతలనాథులమూఁక మాఁడ॥ 56

టీక. రా. కృష్ణు- నల్లనివాని, సుభద్రి - మంగళకరమైన, (భా) ఆత్మపురి-ఇంద్రప్రస్థపురము, కడంక - యత్నముతో, పృథు-గొప్ప.

రా.సీ. కోవిదస్తోమంబు గుంపులయి (కనెను
నెనరునను సుభద్రిజననుతు నభి)
మాని రాఘవు; నెందుఁగానము మన(మన్య,
మహితసుగుణవంతు, మాన్య, ఖాండ)
జమునైన గుటిసేయ జాలునీ భ(వవన
మునుగాల్పఁగావహ్ని పనివడికృతి)
ప్రభుఁ డౌవని వడిగావలయునంచుఁ(దలఁచె
దద్ధితమునుఁజేసె దా విజయుఁడు
గీ॥ దశరథేశ్వరుఁ డుచితయత్నముల సల్పి;
యుర్విజం గూడి యుపవాస ముండుమనియె
నతఁడు కాకుత్స్థకులకలశాబ్ధిచంద్రు;
రామునందునఁ బ్రీతిఁ బురజను లిడిరి॥ 57

భా.గీ॥ కనెను నెనరునను సుభద్రి జననుతు, నభి
మన్య, మహితసుగుణవంతు, మాన్య; ఖాండ
వ వనమునుఁ గాల్పఁగా వహ్ని పనివడికృతి
దలఁచెఁ; దద్ధితమునుఁ జేసె దా విజయుఁడు॥ 57

టీక.రా. సుభద్ర - మంగళకరములగు, ఖ - ఆకసమునందుండు, అండజము-పక్షి.ది, ఏయజాలు-[illegible]గలిగిన, అనఁగా నంతగుటిగలవానిని, భవవనమునుఁ [illegible]వహ్ని-సంసారాట

వినిఁగాల్చ నగ్నిఁబోలినవాఁడు కనెను. (రా) చూచెను, (భా) ప్రసవించెను. (రా) మనము, అన్యన్-ఇతరుని, కోవిదస్తోమము-పండితుల సమూహము.

రా.సీ. ఆజనకోటి ప్రియత నచ్యుతాప్తి బె
రసెఁ; దత్సుకృతిఁగాంచి, ప్రతిభతోడు
తను మించు నిజయశోధావళ్యమున నీతఁ
(డివముపరిభను; వెలైమిత్రుల నర్థ)
ముదయుతారి యసిరి; భువివిభుఁడు యుధిష్ఠి
రవరుఁ డిందప్రస్థ) రమ్యధాన్య
మోదితభిక్షుం డపు డలంకరింపించె
(నగరి; భాసురగురునయమయసభ)
గీ॥ జనకునానతి వీడె క్ష్మాజావిభుండు;
పరమసంతోషమునఁ బొంగి పౌరులును బె
రసిరి చుట్టపక్కాలను; రంగరంగ
వైభవంబులతోఁ బురి ప్రజ్వరిల్లె॥ 58

భా.ఆ॥ ప్రియత నచ్యుతాప్తి బెరసెఁ దత్సుకృతి గాం
డివము; ప్రభను వెలైమిత్రుల నర్థ
భువివిభుఁడు యుధిష్ఠిరవరు డిందప్రస్థ
నగరి భాసురగురునయమయసభ॥ 58

టీక. అచ్యుతాప్తిన్ - (రా) నాశనముగాని యాప్తిని, (భా) కృష్ణుని యాప్తిచే, ఇవముప్రభను-(రా) మంచుయొక్క కాంతి, అర్థముదయుతారి - శకలములయిన సంతోషముగల శత్రువులుగలవాఁడు. ఇందప్రస్థ రమ్యధాన్యమోదితభిక్షుండు-శ్రేష్ఠములగు తూములకొలది మంచిధాన్యముచే సం

తోషకుల దఁబడిన యాచకులు గలవాఁడు. గురునయమయసభ (రా) నయమయ-నీతిమంతుఁడగు, గురు-తండ్రియొక్క, సభ. (భా) గురు - ఎక్కువగు, నయ-నీతిగల, మయసభ - మయుని సభ. బెరసె-కలిసె, భావ్యము-తెలుపు.

రా. ఉ॥ తా(సి)తకీర్తి యానృపుఁ డుదగ్రత వెల్గెను భాసురంబుగా;
వాసిజరాగమంబునను భార్గవిగేహహితుండు గ్రుంకెఁ బ
ద్మాసుతు భీము డగ్గి యెడదన్ హత మత్యధికోగ్రమూర్తియై
చేసి కలిన్ లసన్నటనఁ జేయు నతం డిపు డంచహా యనాన్॥ 59

భా. కం॥ సితకీర్తి యానృపుఁ డుద
గ్రత వెల్గెను భాసురంబుగా; వాసిజరా
సుతు భీముఁడగ్గి యెడఁదన్
హత మత్యధికోగ్రమూర్తియై చేసి కలిన్॥ 59

టీక. (రా) జరాగమంబునను - ముసలితనమువచ్చుటచే (దినమంతయు వెలిగి వృద్ధుడగుటచే;) భార్గవి-లక్ష్మీదేవియొక్క, గేహ-ఇంటికి (పద్మమునకు) హితుండు-మిత్రుఁడు (సూర్యుఁడు) పద్మాసుతు - లక్ష్మీదేవికుమారుని (మన్మథుని). భీముఁడు-శివుఁడు, అతండు-ఆశివుఁడు, లక్ష్మీదేవియింటికి హితుఁడు గను కను, లక్ష్మీదేవికుమారుని శివుఁడుచంపె గావున, శివునిపై సూర్యునకసూయగలదనియు, సాయంకాలమున శివుఁడు నాట్యముచేయును గనుక చూడలేక గ్రుంకెనని భావము. (భా) జరాసుతు-జరాసంధుని. లలి-ఉత్సాహము.

రా. సీ॥ మించి చంద్రుండాక్రమించె ధరణిపాలి;
నంచితరాజసూనాస్త్రముఁద
సవనులు గొనిరి దంపతులచే నపజ్రము

ము; మఱి కువలయహితముగ ధర్మ
మూర్తులగు సురలు ముదమున సుధఁ గ్రోలఁ
గాఁ బండువెన్నెలల్ గాచెఁ; సంత
సపుణ్యనులు చకోరసంతతి ధృతి సల్పె;
సద్రుచి హరి శిశుజనతతిముఖ
గీ॥ సకలనరచిత్తతాపాలు జదివెఁ; జక్రి
పాటవము నడఁచెఁ; వంతపాలయి వన
జాళి గన్నుల మూసెఁ; దేంట్లందు చిక్కెఁ;
సంద్రముప్పొంగెఁ; గఱఁగెను జంద్రశిలలు॥ 60
భా.ఆ॥ మించె ధరణిపాళి, సంచితరాజసూ
యము మఱి కువలయహితముగ ధర్మ
సంతతి ధృతిసల్పె; సద్రుచి హరి శిశు
పాలుఁ జదివెఁ జక్రిపాటవమున॥ 60

టీక. (రా) ధరణి-భూమి, పాళి-ప్రదేశము, (భా)-ధరణీశ-రాజుల, ఆళి-గుంపు; సూనాస్త్రు-మన్మథుఁడు, కువలయ-(రా) కలువలకు, (భా) ప్రపంచమునకు, ధర్మ-(భా) యముని, సంతతి-(రా) గుంపు, (భా) సంతానము, హరి- రా)చంద్రుఁడు, (భా) కృష్ణుఁడు, చక్రి-(రా) చక్రవాకముల, (భా) సుదర్శనచక్రముయొక్క. పవన వాయువు, కన్నుల మూసె-ముడిచెను, తేంట్లు-తుమ్మెదలు.

రా.సీ॥ మంథరబోధ రామవనవాసము పదు
నాలుగేండ్లు భరతపాలనమును
ధవు వేఁడి తాటకాధ్మరాజుసిరి బ
దపడి హరించెఁ జాత్రతసుమమూర్తి

తరుణి కైక విభుద త్తద్వివరముల మీ
(దమున; రహి సుయోధనమహితకృతి)
ప్రభుమంత్రి సిద్ధంబు(పాయనిధృతితోడఁ
జేయించెఁ గృష్ణాంశు) శిష్టరాము
గీ॥ శ్రీక; రప్పించి, వానిచే సీతముగని
సర్వముం జెప్పెఁ గైక; కౌసల్య గోడు
గనె విని స్వసుత రాజ్యాధి(కహారణమును;
మాన్ప ఘనుఁడగు హరి) వంశమండనుండు॥ 61

భా. ఆ॥ ధర్మరాజుసిరిఁ బదఁపడి హరించె జూ
దమున రహి సుయోధనమహితకృతి
పాయనిధృతితోడఁ జేయించెఁ గృష్ణాంశు
కహారణమును; మాన్ప ఘనుఁడగు హరి॥ 61

టీక. తాటకాధర్మరాజు - తాటకను యముఁడయిన రాముఁడు, సుయోధన (రా) మంచియోధుఁడు, (భా) దుర్యోధనుఁడు (భా) కృష్ణా - ద్రౌపదియొక్క, అంశుక - వస్త్రముల, హారణము-అపహారణము, (రా) కృష్ణ-నల్లని, అంశు-కాంతిగల వాని, హరి - (రా) సూర్యుఁడు, (భా) కృష్ణుఁడు. మాతసుమమూర్తి-మామిడిపువ్వువంటి మెత్తనిశరీరముకలది, మండనుఁడు-అలంకరించువాఁడు.

రా. సీ॥ ఘ్మాసుతాపతికి లక్ష్మణుఁడు శాత్రవ(భీముఁ
డలుకతోడ బలికెఁ బెఱుచఁ గపటు)
భాసఁ గైక, గురు ధవద్విభూతి(హారణు
నధము దుశ్శాసను నడచి, నల్ల)
పాతించి నిర్జేతుఁబ్రభుని, పడెద(నాన;

వని భీకరముగఁ జేయంగ నన్న)
మునఁ గాని మొన వచ్చి పోర, నాజి (నుదుటు
మీఁటిచేయు సుయోధనోరుహతిని)

గీ॥ నల్వుదు ననుచు దుర్నిరీక్ష్యకుటిలభ్రు
కుటియగుచుఁ గన్నులను మిడుంగురులు రాలఁ
బల్కె; వాని రాముఁడు శాంతపఱచి యొప్పె
న్న్యాజ సౌమిత్రి వనికి తాఁ గదన వెంట॥ 62

భా.గీ॥ భీముఁడలుకతోడఁ బలికె బెలుచఁగ వట
హారణు నథము దుశ్శాసను నడచి నల్ల
నాన నని భీకరముగఁ; జేయంగ, నన్న
నుదుటుమీఁటిచేయు సుయోధనోరుహతిని॥ 62

టీక. భీముఁడు - (రా) భయంకరుఁడు, పెలుచ, కకట-(రా) కకటమైన, (భా) పెలుచగ, పట-వస్త్రముల, గురు-(రా) తండ్రిని, దుశ్శాసను-(రా) దుష్టమగు శాసనము గల వానిని, (రాము నడవికి బొమ్మనెను గనుక) అన-(రా) ఒట్టు, (భా) త్రాగుటకు, అని - (రా) యుద్ధమును, (భా) యుద్ధమందు, నన్న - (భా) సంజ్ఞ, నన్నమునుగాని - (రా) తక్కువ కానటువంటి, (భా) సుయోధన-దుర్యోధనుని, ఊరు-తొడల, హతిని-కొట్టుటను, చేయంగ - చేయుటను (రా) సుయోధన-మంచియోధుల, ఉరు - గొప్ప, హతిని - కొట్టుటను చేయంగ - చేయుటకు. దుర్నిరీక్ష్య - చూచుటకు భయంకరమైన, కుటిల-వంకరయగు, భ్రుకుటి - కనుబొమలుకలవాఁడు, (కోపము చే); మిడుంగురులు-అగ్నికణములు.

రా.సీ॥ ప్రజ కీనె భరతుండు నిజజనని (కృష్ణ
మృగనేత్రకతన సిరినెలసె మఱి)
రాముండు రిపు(ధర్మరాజు గోల్పడె వసుం
ధరను; నెత్తగ గోడు దశరథుండుఁ
బొగిలెనని; యనె నప్డు ముని వేష(మునను
వనిని నేఁడులు పదియు నల రెండు)
నీ రహార్పతివంశనీరధిరాకేందు
నుండ దైవము సేసె నొక్కొ! యొకది
ఆ॥ వనమునను నగు (నొక్కవర్ష మజ్ఞాతులై
యుండ నియతి)తోడ నుర్విపతి)
రామలక్ష్మణులని పరిభుసగ్రకను భక్త
వరదుఁ దూఱుపాఱఁబట్టె నంత॥ 63

భా.గీ॥ కృష్ణమృగనేత్రికతన సిరినెలసె, మఱి
ధర్మరాజు గోల్పడె వసుంధరను నెత్త
మునను; వనిని నేఁడులు పదియు నల రెండు
నొక్కవర్ష మజ్ఞాతులై యుండ నియతి॥ 63

టీక. (రా) కృష్ణమృగనేత్రి-కృష్ణమృగమువంటి కన్నులు గలది, (భా) కృష్ణ-ద్రౌపది, మృగనేత్రి - లేడివంటి కన్నులు గలది, ధర్మరాజు-(రా) యముఁడు, ఎత్తఁగ - (రా) చెలరేఁగఁగా, (భా) నెత్తమునను-జూదమునందు. ఎలసి-పొందె, పదియు, రెండు, ఈ - రెండు అనగా పదునాలుగు. అహార్పతి-సూర్యుడు, ప్రభుస-దశరథుని, వర్షము-సంవత్సరము.

రా.చ॥ ప్రణుతచరిత్రులున్ (ఘనులు భవ్యగుణాఢ్యులు కృప
పాండు) వా

రణసితకీర్తి తే(జులును రమ్యచరిత్రులు శుభ్రరామ)ల
క్ష్మణు లవనీరుహన్ (బొరసి కానకు నేగిరి భీతిలేక;) స
ద్గణచరితాత్ములౌ (బుధులు కుందయినన్ విడఁబోరు
పాడి)నిన్॥ 64

భా.గీ॥ ఘనులు భవ్యగుణాఢ్యులు క్రమ్రపాండు
జులును రమ్యచరిత్రులు శుభ్రరామ
బొరసి కానకు నేగిరి భీతిలేక;
బుధులు కుందయినన్ విడఁబోరు పాడి॥ 64

టీక. పాండువారణ - తెల్లనియేనుఁగువంటి (ఐరావతము వంటి) పాండుజులు-పాండురాజకుమారులు, రామ (భా) స్త్రీ (ద్రౌపది) క్రమ-ఇంపైన, శుభ్ర-ప్రకాశించు.

రా.సీ॥ గుహుని నమస్కృతుల్ గొని, దాటి గంగాన
దిని, భరద్వాజు మన్ననల నంది
చిత్రకూటంబునఁ జెలువొప్ప వారుండఁ
బుత్రమోహంబునఁ బొగిలి దశర
థుఁడు సేరె దివి; భరతుఁడు గుంది, తానన్న
కడ కేగి, రమ్మని యడిగె; నతఁడు
రానన్నఁ బాదుకల్ ప్రభుపీఠి నిలిపి తా
మనెను నందిగ్రామమున; నిచట్లను

గీ॥ (శరభకరిభల్లుకాళి గజరిపుకిటుల
వ్యాఘ్రతతుల ఝాఁపతనయు లంతహీనిఁ
గనుచుఁ జనిరి వేతిరుమై న్మృగయుతవని
నధికమోదముతో) దండకాటవికిని॥ 65

భా.కం॥ శరభకరిభల్లుకాళి గ
జరిపుకిటుల వ్యాఘ్రితతుల క్ష్మాపతనయులం
త రహిం గనుచుం జనిరివే
తిరమై మృగయుతవనికి నధికమోదముతో॥ 65

టీక. గజరిపు-సింహము, కిటి-పంది.

రా.సీ॥ రాముండు సంగ్రామభీముం డచటం జంపె
బిరుదుని దనుజుం గ్రొల్విపు విరాధు
లక్ష్మణుంబ్రీతిం గలసి; మునులునుం గర
(మ్మీరసాధులు జడదారు లెచ్చు)
నఘులం దుంచెదరంచు (నలరుచుం గన నాఘు
నులగొన; బాశుపత్రిలలి నెఱు—
మురహరాంశుండగు రాముని జుట్టిరి మఱి చూ
(తమని మించి; విజయుండు మహితశివు)

గీ॥ తరపుం గోపలక్షణుండగు తమ్ముతోడ
రాముం డచ్చోటు వాసి, గారామున శర
భంగుని సుతీక్ష్ణు నంతం గుంభజునిం గనెం; బ్రి
యమున వారు హితోపదేశము సలిపిరి॥ 66

భా.ఆ॥ భీముం డచటం జంపె బిరుదుని దనుజుం గి
మ్మీరు సాధులు జడదారు లెచ్చు
నలరుచుం గన నాఘునులం; గొనం బాశుప
తమని మించి విజయుండు మహితశివు॥ 66

టీక. భీముండు-(రా) భయంకరుండు-(రా) కరమ్ము, ఈరు-ఇద్దఱు సాధులు (భా) కిమ్మీరుండనెడు రాక్షసుని (రా) అఘ నుల, గొనబున్-యందమును, ఆశుపత్రిన్ - వేగముగు పత్రిని

(గరుత్మంతుని) విజయుఁడు-(రా) జయశీలుఁడు (భా) అర్జునుఁడు (భా) అనిన్-యుద్ధమందు, మించి, పాశుపతమును కొనన్ - తీసికొనఁగా, బిరుదు - శూరుఁడు, కిల్బిషు - పాపి, తరపు-సమానపు.

రా.ఉ॥ ఆవలఁ దమ్మునితో (నరవరాగ్రణి జిష్ణుఁడు నవ్యహారి)త్వ
జావిభుఁ డుగ్రలిం(గొనుచు జానుగఁ జేరెను గూర్మి నాత్మ)గో
దావరిఁ;గట్టి సద్ (గృహముఁ దత్సుకృతుల్ గడు ప్రీతి
మించన్;)గం
బావనకీర్తితో (ముని రపారముదంబు నమర్త్య లోందఁ)గన్॥67

భా.గీ॥ నరవరాగ్రణి జిష్ణుఁడు నవ్యహారి
గొనుచు జానుగఁ జేరెను గూర్మి నాత్మ
గృహముఁ; దత్సుకృతుల్ గడు ప్రీతి మించ
ముని రపారముదంబు నమర్త్య లోందఁ॥ 67

టీక. నరవరాగ్రణి - (రా) రాముఁడు (భా) అర్జునుఁని, జిష్ణుఁడు (రా) జయశీలుఁడు (భా) దేవేంద్రుఁడు కూర్మి నాత్మన్-(రా) మనస్సునందు సంతోషముతో (భా) ఆత్మగృహము-తన నెలవును (స్వర్గమును) హారి-మనోజ్ఞుఁడు, ఉగ్రలి-స్త్రీ (సీత)

రా.చం॥ మనముఁ హారిన్నై (తివిరి,మాంజులరూపముఁ దీర్చి,
సూర్వ)నూ
ననయు పరాఘురా(శి రతినాధనిపీడితచిత్త జాణ) శూ
ర్పణఖయుఁ దాటకా(విజయునైఁ బడె; నాతడు వెల్లువేసఁ)ద
మ్ముని నెనఁ దన్ముడున్ (వలదు పొమ్మని పల్కెను భావు
నంత) టన్॥ 68

భా.గీ॥ తివిరి, మంజులరూపముఁ దీర్చి, సూర్ప
ణ రతినాథనిపీడితచిత్త జాణ
విజయుపైఁ బడె; నాతఁడు వెళ్లు వేఁడ
నలదు సౌమ్ముని పల్కెను భామ నంత॥ 68

టీక. రా. సు-శ్రేష్ఠమగు, ఉరు - అతి, అనూన - అధిక మగు, నయ-నీతికి, పర - ఇతరమగు, అఘ - పాపముయొక్క, తాళి - గుంపయినది (అనగా నీతిబాహ్యురాలగు పాపిష్ఠి (భా) సు; ఊర్వశి-తాటకావిజయుఁడు-(రా)రాముఁడు, శూర్ప+నఖ-శూర్పణఖయగును గనుక న ణ లకు ప్రాసము చెల్లినది.

రా.సీ॥ కలకల నగ బ్రహ్మజ; (కామినియునుఁ దీవ్ర
తామసంబునఁ బోము) ధరణిపుత్రిఁ
తినఁ జోవ నగ్రజాజ్ఞఁ గోసి సౌమిత్రి
(భవ్యజిష్ణుసుకృతి పౌరుషంబు)
వఱల ముక్కు సెవుల; (వదల దూఱు చెడలఁ
జద లది యజ్ఞాత) చరితులైన
రాసుతులు మదించి చేసిరింతని జన
స్థానస్థుఁడగు ఖరుతో నుడువుచు
గీ॥ నేడ్చె పలవల, వాఁడు దండెత్తె హత్తి
యొక; క్షితిజతో ననుజు బిల (మునను నుండ
నలిపి ఘనుఁడగుహరి) వంశబలుఁ; డెదిర్చె
సేన; శరవర్షము గురియించి రక్కు; లట్టు॥ 69

భా.ఆ॥ కామినియునుఁ దీవ్రతామసంబునఁ బోము
భవ్యజిష్ణుసుకృతిపౌరుషంబు

వదల దూఱు చడలఁ జద; లది యక్షాత
మానను నుండ నలిపె ఘనుఁడగుహరి॥ 69

టీక. జిష్ణు-(రా) జయశీలునియొక్క- (భా) అర్జునుని యొక్క, పౌరుషంబు-(రా) కోపము (భా) పురుషభావము (పుంస్త్వము) దూఱుచు-తిట్టుచు, వదలన్-(రా) వదలఁగా (భా) వీడునట్లు, అది-(రా) శూర్పణఖ (భా) ఆతిట్టు హరి-(రా) సూర్యునియొక్క- (భా) ఇంద్రుఁడు. వదలు-ఆకాశము.

నాగబంధము.

రా.చం॥ హాతి(మిగులో నివాతకవచావగుణుల్ తనరంగఁ జంపెఁ బా
లితకృతి (శ్రీ)ల నీతి నల లీలను నున్న నికామబాణుఁ డా
హతి, (తగవారిఁ బాతకుల వాలగు దుష్టుల బాగుగాను నా
యతరమతో)న; ఖ్యాతి నటి యూటిరి పిల్లరి బంటిజోదులన్

భా.కం॥ మిగులో నివాతకవచా
వగుణుల్ తనరంగఁ జంపెఁ బాలితకృతి శ్రీ)
తగవారిఁ బాతకుల వా
లగుదుష్టుల బాగుగాను నాయతరమతో॥ 70

టీక. నివాతకవచ-(రా) గాలిదూఱనికవచములుగల (భా) నివాతకవచులను రాక్షసులు, నికామబాణుఁడు-యథేచ్ఛముగు బాణములు గలవాఁడు. హాతి-కొట్టుటయందు, అవగుణులు-దుర్గుణులు, కృతి-సమర్థుఁడు, అటి-నశించి.

రా.సీ॥ బిరుదు దూషణుఁ డరి (భీముఁడొచ్చె మొలసి
వేగ సౌగంధిక) రాగుఁడయి, ర

ఘనపుండు నేలకు గోలకుఁ దెచ్చిన
(కారణమున; వెండి కడిమినిఁ జటు)
లోద్దండగతిఁ బోర (నుడివె ధృతి యుధిష్ఠి
రుఁడు రాముఁడు నహు)లఁ దకటోంకు
లను దార్ఢ్యమున హెచ్చుగను (త్రిశిరుని శితే
(షు దివి కనిపె; జిష్ణుఁడు దగ వచ్చె)
గీ॥ నోసరాకృతి నీగతితో నని దిగు
లందు పదునాల్గువేవుర నసురుల ఖగు
నణఁచెఁ; బోయి శూర్పణఖ రావణుని కనియెఁ
దనదు బన్నమునకు సీతఁ గొను మటంచు॥ 71

భా.ఆ॥ భీముఁడొచ్చె మెలసె వేగ సౌగంధిక
కారణమున, వెండి కడిమిని జటు
నుడువె, ధృతి యుధిష్ఠిరుఁడు రాముఁడును నహు
షు దివి కనిపె, జిష్ణుఁడు దగ వచ్చె॥ 71

టీక. సౌగంధిక - సౌగంధికపుష్పము, సౌగంధికరాగుఁడయి - సౌగంధికపుష్పమువంటి రంగుగలవాఁడై (అనగా ఎఱ్ఱనివాఁడై రక్తముచేఁ దడిసి) జటు - (భా) జటుఁడను రాక్షసుని, యుధిష్ఠిరుఁడు-(రా)యుద్ధమందు స్థిరముగువాఁడు, రాముఁడు-(భా) రమ్యముగువాఁడు, అహులు-(రా)పాములను, జిష్ణుఁడు-(రా) ఇంద్రుఁడు (భా) అర్జునుఁడు, హెచ్చుగను-హెచ్చయిన. ఒచ్చెము-అవమానము, కడిమి-పరాక్రమము, శితేషు-వాడియగు బాణములు గలవానిని.

రా.సీ॥ దశకంధరుఁడు నాపై దశనుగాంచి, (చెలఁగు
రహిం వచ్చి యాదరించె; హాటకోప)

గముఖసుశకునాళ్ విసర లేడినై (యాత్ర
నాచరించెను గరమఘుఁడునగుసు)
తారీక్ష్యరాజ్ఞచే మారీచుఁడను (యోధ
నుందు భూపతిసూనులుండు కడకు;)
సీతకై కట్టవచ్చిన రాముచే (భంగ
పడి తనపెంపఱి వాఁడు ననియె)
గీ॥ దినికి పోలత్న్మగా యంచు భువిసుత విన;
నన్న కేమి భయంబు లేదన నుడుగక
దూఱి పనుపంగ సౌమిత్రి తోయజాక్షు
రామచంద్రుని దిక్కేగె; రావణుండు॥ 72
భా.గీ॥ చెలఁగు రహివచ్చి యాదరించె హరి; ఘోష
యాత్ర నాచరించెను గరమఘుఁడునగు సు
యోధనుండు భూపతిసూను లుండుకడకు,
భంగపడి తనపెంపఱి వాఁడు ననియె॥ 72

టీక. హరి-(భా)కృష్ణుఁడు, హరిఘోషణ-(రా)గుఱ్ఱముల సకిలింతలు, ముఖ-మొదలగు. అఱి-తగ్గి.

రా.చం॥ అరుదగుమానినై(చెలఁగి పోలిని, లోఁతునసింధు
రాజు)నై
కొలుచు, జానకీ(వనిత కృష్ణమృగేక్షణ పర్ణశాల)యం
దుపరివేదనం(బరఁగ నొంటరినుండఁగ బల్మిఁ గొంచుఁ)దా
నరగను నాపెహో(జనియె సంతసమందుచు స్వాంతమందు)నన్
భా.గీ॥ చెలఁగి పోలిని లోఁతున, సింధురాజు,
వనిత కృష్ణమృగేక్షణ పర్ణశాలఁ
బరగ నొంటరినుండఁగ బల్మిఁగొంచుఁ

జనియె సంతసమందుచు స్వాంతమందు॥ 73

టీక. సింధురాజు-(భా) సైంధవుఁడు, లోతుపసింధురాజునై-(రా)లోతున సముద్రమునుఁ బోలినవాఁడై, కృష్ణ - (భా) ద్రౌపది మృగేక్షణ-లేడివంటి కన్నులుగలది, కృష్ణమృగేక్షణ (రా) కృష్ణమృగమువంటి కన్నులుగలది. హాళి - ఆనందము, శెరలుచు-అతిశయించుచు.

రా.సీ॥ కవిసిపోరియు జటాయువు (భంగపడె; నేగ
వడిని నా వరమఖులుఁడు) దనుజుఁడ
వనిజ నుంచె నశోకవనములోపల (క్షోణి
తలనాథజులు రాజకులతిలకుల)
బలఁ గానకడఁకున వచ్చి రా) నరణి నె
మకుచునుఁ దమహితమణివలఁతి జ)
టాయువుఁ గని రయ్యెడ ఖగరాజ (ముహిత
మునుఁ బొంది మనముల ముదము గనిరి)
గీ॥ దహనకార్యంబు సేసి రతంచు సమయఁ
జదివి దైత్యుఁ గబంధుని శబరిఁ బ్రోవ
ఋష్యమూకాద్రి కేగి సుగ్రీవుచెలిమి
సల్పు డంచు హితంబు నా శబరి నుడివె॥ 74

భా.గీ॥ భంగపడె నేగవడిని నావరమఖులుఁడు;
క్షోణితలనాథజులు రాజకులతిలకు ల
రణి నెమకుచునుఁ దమహితమణి వలఁతి జ
ముహితమునుఁ బొంది మనముల ముదము గనిరి॥ 74

టీక. (భా) అరణి-మథించి నిప్పుఁ బుట్టించెడు కొయ్య. నెమకుచు-వెదకుచు, వలతి-నేర్పరి.

రా.చం॥ మనముల నెన్నుచున్ (మిగుల మాన్యచరిత్రులు
మేటిమత్స్య)లో
చననుడిఁ,గోఁతికాఁ(పురము సద్రుచిఁ జేరిరి మోదమంది;) తా
ము వయముగా మదిన్ (మఱువఁబోక హితంబును మాఱు
రూపు) లం
తనుఁ బడి వంతఁ, జా(లధృతిఁ దాల్మి ధరించిరి లగ్గు మించఁ)
గన్॥ 75

భా.గీ॥ మిగుల మాన్యచరిత్రులు మేటిమత్స్య
పురము సద్రుచిఁ జేరిరి మోదమంది,
మఱువఁబోక హితంబును మాఱురూపు
ల ధృతిఁ దాల్మి ధరించిరి లగ్గు మించ॥ 75

టీక. రా. కోఁతికాఁపురము - ఋశ్యమూకాద్రి, మాఱు
రూపు లంతనుఁబడి వంతన్-అంతట దుఃఖముచే కళావిహీ
నులై, లగ్గు-శ్రేయము. మత్స్యలోచననుడి - శబరిమాటలు,
వంత-దుఃఖము.

రా.సీ॥ (క్షోణినాథసుతులు సోమముఖులు వీరా)
జిల్లుపంపఁ గనిరి; క్షితిజమగఁడు
తన్మనకొలకు రాల్చెఁ గన్నీటిచుక్కఁ-దా
(టు; నెటఁ దద్వనజవదనను గృష్ణ)
వేణి వెదకుచు, హా(విమలపల్లవపద
భ్రమరాక్షి యజ్ఞాత) పాలినుంటె?
హాసతి నాకిప్పు డయ్యెను దినమొక్క
(వత్సరమ్ము; కొలిచి సత్సహించి)

గీ॥ తొల్లి దాసీజనము నిన్నతులితముగ ని
పుడు వనట నొందితె యని రాము డనుచుండె;
బలమునకుఁ బట్టుకొమ్మల వారి వాలి
పంపెఁ దనుఁ జంప నని భయపడె రవిజుఁడు॥ 76

భా.ఆ॥ క్షోణినాథసుతులు సోమముఖులు విరా
టు, సెజేఁ దద్వనజవదనుఁ గృష్ణ
విమలపల్లవపద భ్రిమాక్షి, యజ్ఞాత
వత్సరమ్ము గొలిచి రుత్సహించి॥ 76

టీక. (రా) పంపన్-పంపాసరోవరమును, కృష్ణవేణిన్-నల్లనిజడగలదానిని, అజ్ఞాతపాలీన్ - తెలియబడనిచోటునందు (భా) తద్వనజవదనను - అతని భార్యను (సుధేష్ణను) కృష్ణ-ద్రౌపది. దాటు-గుంపు, వనట-దుఃఖము.

రా.సీ॥ వారి మారుతి దెచ్చి బాన సల్పిరి రామ
తరణిజు లొకరి కొకరుసుఁ దోడు
నీడలైమన; ధరణీజ గొంపోబడు
చున్ ధరవైచిన సొమ్ము రాఘు
వుఁడు గాంచె; సూర్యసుతుఁడు సెప్పెఁ దన్నుఁ బు
రమునుండి తోలి యాగ్రజుఁడు నెంద్రి
(ఘనసింహాబలుఁడు పైకొనుటను స్వామిణిఁ
బావని, విని దాక బలిమితో)డ

గీ॥ రఘువరుఁడు దుందుభికళేబరంబు గోఁట
మీటె; నత తాళ్ళడచెఁ; జెట్టుచాటునుండి
(గొనబుగను వాలి వీరుఁడు బనివడినయ
విరహితుఁడగు వానినిఁ జదిపెన్) శరమున॥ 77

భా.కం॥ ఘనసింహబలుఁడు పైకొను
టను స్వరమణిఁ, బావని విబిడాక బలిమితో
గొనబుగను వాలి పేరుఁడు
బనివడి నయవిరహితుఁడగు వానినిఁ జదిపెన్॥ 77

టీక. ఇంద్రి-(రా) వాలి, సింహబలుఁడు-(రా) సింహము వంటిబలముగలవాఁడు (భా) కీచకుఁడు, పావని - (రా) పావనమైనదానిని, (రా) భీముడు, వాలి. (భా) విజృంభించి, సత తాళ్లను-ఏడు తాటిచెట్లను, పైకొనుటను-(రా) కవియుట (భా) యత్నించుట. తరణిజుఁడు-సూర్యుని కుమారుడగు సుగ్రీవుడు, మనన్-ఉండునట్లు, డాక-శౌర్యము, హనుమ-హనుమంతుడు.

రా.సీ॥ అంగదు యువరాజు నవనిపు సుగ్రీవు
గపికంధరుం జేసె క్షితిజమగఁడు
(నుతబలుఁడు సుయోధనుఁడు, దాయ లసమాన
చరిత వెలఁది యుండు క్ష్మాతలంబు)
వెదకింపఁగా గోరి వేచి వనగ్రస్తవం
తమకుఁ బంకు మహీధరచరులనుఁ
(గోవిదస్తుతులను గురు భీష్ముముఖులను
రయము గూడఁగను నరసి కనుఁగొనిఁ)
గీ॥ రండనుచుఁ బంపెఁ; గొని యుంగరంబు దక్షి
ణమున కంగదాదులతో హనుమ యరిగి మ
హేంద్రగిరి నుండు సంపాతిహితమున నధ
మునకెగిరె గరుడునిఁ బోలి వనధి దాఁటి॥ 78

భా.గీ॥ నుతబలుఁడు సుయోధనుఁడు దాయ లసమాన
చరిత వొందిి యుండు క్ష్మాతలంబుఁ

గోవిద స్తుతులను గురుభీష్మముఖులను
రయము గూడఁగను నరసి కనుఁగొని॥ 78

టీక. సుయోధనుఁడు. (రా) మంచియోధుఁడు (భా) దుర్యోధనుఁడు-(రా) దాయ-రావణుఁడు, లసమానచరిత-ఒప్పుచున్న చరిత్రగలది (సీత) (భా) దాయులు - పాండవులు, అసమాన చరిత-సమానము లేని చరిత్రగలది (ద్రౌపది) గురుభీష్మముఖులను-(రా) ఎక్కువ భయంకరములగు ముఖములుగలవారిని, (భా) ద్రోణుఁడు భీష్ముఁడు మొదలగువారిని.

రా సీ॥ శోధించి మైనాకు, సురస సింహిక ఱుంచి,
లంకనుఁ బరిమార్చి లంకఁజొచ్చి
కన్నీరు మున్నీరుగా నేడ్చు క్ష్మాజను
గని, దశముఖుని జంకెనలను విని,
రాముక్షేమము దెల్పి, రమణికొసఁగి యుంగ
రము రత్నమంది, వనము పెకల్చి,
వనపాలకులదోలి, వక్త్రినాసాదులఁ
జదుప రావణుఁ డగ్గి జంబుమాలి

గీ॥ గురు(భుజబలముగల్గెడి యురుఖులు, జదు
పెఱుఁగని వలఁతిం, దులువను, హితు, సుశ) స్త్ర
మ(ర్మజితరిపుఁ, బనుపఁగ మహితగజహా
యురథభటులతోడఁ గదలె నతఁడు వే)గ॥ 79

భా.కం॥ భుజబలముగల్గెడి యురుఖ
లు, జదుపెఱుఁగని వలతిం, దులువను హితు, సుశ
ర్మ, జితరిపుఁ; బనుపఁగ, మహిత
గజహయరథభటుల తోడఁ గదలె నతఁడు వే॥ 79

టీక. (రా) సుశస్త్ర - మంచిశస్త్రములయొక్క, మర్మ-మర్మములవలన, జిత-గెలువబడిన, రిపున్-శత్రువులుగలవానిని, మున్నీరు-సముద్రము, మహిత-ఎక్కువగు.

రా. చం॥ తమ (బలమొప్ప సైనికులు దక్షులు దానఁ గడంగఁ
బోయి, కొం
చు మమతఁ గో)ల లాఁకపినిఁ జూచిరి; మర్కట చేష్ట రాలబా
రుమి(వులఁ బట్టి నవ్వి రటు గ్రొవ్వి లలిన్; విడిపించి రంత భీ
మముఖులు వే)ల్పుగొంగలు సమందగతిం దమ తేజి పగ్గ
ములే॥ 80

భా. కం॥ బలమొప్ప సైనికులు ద
క్షులు దానఁ గడంగఁ బోయి, కొంచు మమత గో
వుఁ బట్టి నవ్విరటుఁ గ్రొ
వ్వ లలిన్, విడిపించిరంత భీమముఖులు వే॥ 80

టీక. (రా) కోలలు-బాణములను, నవ్విరటు-ఆటులనగిరి (భా) అవ్విరటు-ఆ విరాటరాజును, భీమముఖులు-(రా) భయంకరములగు ముఖములుగలవారు (భా) భీముడు మొదలగువారు, వేల్పుగొంగలు-రాక్షసులు, తేజి-గుఱ్ఱపు. రాలబారు-రాళ్లసమూహము, ఉరుశిల-గొప్పరాతిని.

రా. చం॥ ఉజికెఁ గపీంద్రుఁడున్ (హసనయుక్తుఁడునై కొనె నా
ఁసద్వ)లుం
దురుశిల వారిఁదో(లుడు, సుయోధనదుష్టుఁడు లోఁచు
చు స్త్రీ)రం
బుఱువుగ బంట్లబా(రుఁ గడు నొప్పుచుఁ గూడి పరుం గలం
ఖి)యి

చ్చె;రిపునిఁ జంపి తా(మురిసె శ్రీని మరుద్వరపుత్రుఁ డం
తట‌న్॥ 81

భా.గీ॥ హాసనయుక్తుఁడునై కోనె నాల సద్బ
లుఁడు సుయోధనదుష్టుఁడు; లోచు చత్త
రుఁ గడునొప్పచుఁ గూడి పరుం గలంచి
మురిసె శ్రీని మరుద్వరపుత్రుఁ డంత॥ 81

టీక. (రా) ఆ, లసద్బలుఁడు - మంచిబలముగలవాఁడు (భా) ఆలన్-ఆవులను, సద్బలుఁడు, సుయోధనదుష్టుడు-(భా) దుర్యోధనుడను దుష్టుడు (రా) మంచియోధుడగు దుష్టుఁడు, ఉత్తరున్ (భా) ఉత్తరుని (రా) మరుత్-వాయుదేవుని, వరపుత్రుఁడు, హనుమంతుడు (భా) మరుత్-దేవతల, వర-రాజు (ఇంద్రుని) పుత్రుడు, (అర్జునుఁడు)

రా.సీ॥ దశకంఠుఁ డగ్రె; నా(తతబలాఢ్యుఁడయిన
తగునేర్పరి యభిమాత్రమునఁ బోయి
యమ్మ్మలక్షుంను నేయ, విటపి హనుమ ధ
(న్యుఁడు గ్రహించెను; ధృతి నుత్తరమును)
వాని కిచ్చె; నసుర(వరసుయోధనకృతి
పాంసుసమాఖ్యులైఁ) బావని శర
ముల నొంచి మించె; సల్లలితధైర్యము దితి
(కొమరు లొందిరి; తమతమ బలములు)
గీ॥ కొలఁదిఁబోర, వాయుజుఁడు వారలను నొంచి
నేలఁగలిపె నతుకుమారుని; దనుజకతి
యంప హనుమంతుఁ బట్టెవనంచు నింద్ర
జిత్తు కత్తి నూఁకుడు నేగ సేఁతోఁడ॥ 82

భా.ఆ॥ తతబలాఢ్యుఁడయిన తగు నేర్పరి యభిమ
న్యుఁడు గ్రహించెను ధృతి నుత్తర; మును
వరసుయోధనకృతి పాండుసమాఖ్యుని
కొమరుడు లొందిరి తమతమ బలముల॥ 82

టీక. ధృతి-(రా) ధైర్యముతో (భా) ప్రీతితో, ఉత్తరమును-(రా) జవాబు, (భా) ఉత్తర-ఉత్తరయను విరాటరాజపుత్రికను, మును-ముందుగా, అసురవరసుయోధనకృతి-రాక్షసులలో మంచియోధుడగువిట్ట (అక్షకుమారుఁడు) పాండుసమాఖ్యుని-(రా) తెల్లనికోతిగలవానిని. (భా) పాండువను పేరుగలరాజుయొక్క, బలముల-(రా) శక్తుల (భా) సైన్యముల, విటపి-చెట్టు.

రా.సీ॥ ఘోరుఁ డాతం డిట్లు (తోరపుధృతి నేగి
దుర్యోధనసుజిష్ణు) ధూర్తరిపు మ
దుత్సుతు డా సెఁ; దీకల నేయుటకు దైత్యు
(లు వెస గైకొనిరి; హరి విజయుఁడు సు)
కృతి కలగుండు వారిఁ బఱచెఁ; బఱచె సే
నలు; మరల్చెను మేఘనాదుఁ డుగ్ర
యోధనుండు మొనల; నొప్పుచుఁ డా బద్మ
జాస్త్రమ్ము వైచెను హనుమమీఁద

గీ॥ పావని యజమంత్రప్రభావమున నిలిచె;
నతని బంధించె దనుజాధిపాగ్రనంద
నుండు రోషారుణితనయనుఁడు; సనిమొను
గన గుణవిభునిఁ) బంక్తికంఠుని హనుమఁడు॥ 83

భా.ఆ॥ తోరపు ధృతినేగి దుర్యోధన సుజిష్ణు
లు వెసఁ గైకొనిరి హరి విజయుఁడు సు

యోధనుండు మొనలఁ; గొప్పచుఁ దాఁ బద్మ
నయనుఁడు పనియెను గనఁ గురువిభుని॥ 83

టీక. దుర్యోధనసుజిష్ణు (రా) యోధుల కలవికానివారిని జయించువానిని (భా) దుర్యోధనార్జునులు, హరి-(రా) కోతి, (భా) కృష్ణుని, విజయుఁడు-(రా) జయశీలుఁడు (భా) అర్జునుఁడు-పద్మనయనుఁడు-(భా) కృష్ణుడు గురువిభుని-(రా) గొప్పప్రభుని, కురువిభుని (భా) ధృతరాష్ట్రుని, ధృతి-(రా) ధైర్యము, (భా) ప్రీతి, తోరపు-అందమగు, తీరుల-బాణములను, పఱచె-పరువెత్తెను, అజ-బ్రహ్మ.

రా. శా॥ (ఆనీరుంధు సభన్ ధృతి) స్ఫురణు దైత్యాళిప్రభుం గాంచె; నా
పై (వాలిం గని చెప్పె నెట్టిపనికై వచ్చె) దనం జెల్పె నా
(హా విఖ్యాతుఁడ వంచు ను) ర్విజను నీవర్ణింపవే యంచునుం
దా (వేవేగను మీఱి పల్కె విరివౌ తాల్మిన్) గడున్ గూడుచున్ 84

భా. కం॥ ఆనీరుంధు సభన్ ధృతి
వాలిం గని చెప్పె నెట్టి పనికై వచ్చెన్
హా విఖ్యాతుఁడ వంచును
వేవేగను మీఱి పల్కె విరివౌ తాల్మిన్॥ 84

టీక. స్ఫురణు-ప్రకాశించువాడు.

రా. ఆ॥ (మీఱి పలికె వెంట మిగులశూరుఁడగు సు
యోధనవిభుఁ జూచి యుదుటు తోడఁ
(బోరు వినవొ నష్టము పఱి యారయుఁగదఁ
బొందు లాభ మంచుఁ బుడమిఁ గోరె)॥ 85

భా.కం॥ విరాటపతికి నెండి మిగుల
శూరుండగు సుయోధనవిభుఁజూచి యుదుటుతోఁ
బోరు వినవో నష్టము మఱి
యారయఁగనుఁ బొందు లాభ మంచుఁ బుడమిలో॥85

టీక. సుయోధనవిభు. (రా) మంచియోధులకు ప్రభున్ (రావణుని) (భా) దుర్యోధనుని.

రా.సీ॥ నిక్కంబు నామాట (నక్కయెక్కడ మఱి
నాకమెక్కడ, వారి)జాక్షు డవని
జావరుండు; బలుండు; కావలవరు వాని
(పాలు; నెయ్యి నోసఁగు పాడి దలఁచి
(యటులఁ గానియెడలఁ బటిమఁ దోషియయి దూ)
బ సినుగూల్చెను రామభద్రుఁడు; డతని
యనుజు డట్టిడ; వార లరులను గెంచు శూ
(రు; లయిన నిను, నీవు పొలియఁబోవు)
గీ॥ వనధి నిన్ను ముంచిన వాలి మునిమె రాము
విభుకు; నిన్ను వంచిన కార్తవీర్యుని మడి
పిన పరశురాముఁ గెల్చె; నీవఁగ నెంత?
లీల గుడి మ్రింగువానికి లింగమెంత?॥ 86

భా.అ॥ నక్కయెక్కడ మఱి నాకమెక్కడ వారి
పాలు నెయ్యినోసఁగు పాడి దలఁచి,
యటులఁ గానియెడలఁ బటిమ, దోషి,! యయిదూ
రులయిన నిడు నీవు పొలియఁబోవు॥ 86

టీక. (రా) తోషియయి-సంతోషముతోఁగూడినవాడయి, (భా) దోషి-దోషముగలవాఁడా, అయిదూరులు - (భా) అయిదు

గ్రామములను, నాకము-స్వర్గము, దూబు-అధముఁడవగు.

రా.చం॥ అన(విని యుత్తరం బొసఁగ నాచెన టిట్లని, వెఱ్ఱి,
యేమిఁ జే
సినపనిచే) సిరిన్, విడువ సీతను సున్నము వానిఁ జేతు వి
కను ,(వనటొంది వాఁడియునుఁ గానను హీనతఁ జిక్కియుత్త
రణం
బొనరుచుటా?) బళే! యువతియూపుల కెందును బ్రాఁకు
లాఁగునే॥ 87

భా.కం॥ విని యుత్తరం బొసఁగ నా
చెనటిట్లని, వెఱ్ఱి, యేమిఁ జేసినపనిచే
వనటొంది వాఁడియునుఁ గా
నను హీనతఁ జిక్కియున్ రణం బొనరుచుటా॥ 87

టీక. చెనటి-(రా) రావణుఁడు-(భా) దుర్యోధనుఁడు.

రా.గీ॥ (అలుకగని భీముఁ డనియెడు, తెలియు మెదను
భయపడను దదీయములగు పల్కులకునుఁ
బేదకినుక యీయిలలోనఁ బెదవులకును
రహింనిఁ జెఱుపె హారీ)నొంతు రాము గీము॥ 88

భా.కం॥ అలుక గని భీముఁ డనియెడు,
తెలియు మెదను భయపడను దదీయములగు ప
ల్కులకునుఁ, బేదకినుక యీ
యిలలోనఁ బెదవులకును రహింనిఁ జెఱుపె హారీ॥ 88

టీక. భీముఁడు-(రా) భయంకరుఁడు, హారి-(రా) కపి,
(భా) కృష్ణుఁడా.

రా.చం॥ అన విని పల్కె నాహరియు ప్రోదినిసద్గుల( గట్టివం
క( దీ
ర్చునుపోయి, యోజ్రర్చు రామ్మసుర, శ్రోణిని వంగుట చిల్లి
వెంకు నో
పున(జనదూర, పుల్లల న పోవును బుట్టిననాటిబుద్ధి భూ
మి,నోస(గవా)మహీసుతను, మేలుదలంపకు కీడునన్న కే॥ 89

భా.కం॥ విని పల్కె నాహరియు హ్రో
దినిసద్గుల(, గట్టివంక దీర్చును పోయి యో
జనదూర, పుల్లలన పో
వును బుట్టిననాటిబుద్ధి, భూమిఁ నోస(గవా? 89

టీక. హరి-(రా)కోఁతి (హనుమంతును) (భా) కృష్ణుఁడు.

రా.చం॥ అనియును వెండి నా(ప్రభుని నారసి యీగతి పల్కె(,
శాక)మే
మనయుచి నుండినట్ (గుణము గ్రాహ్యమె తెల్పునకుం?
గడంక)సైఁ
గనలకు పిల్లగా (నడవిఁ గాచిన వెన్నెల యయ్యె నాదు) క్షే
మనయయుతంబులో (నుతులు, మంజులయుక్తమునుం
దలంపు)మా॥ 90

భా.గీ॥ ప్రభుని నారసి యీగతి పల్కె(, శాక
గుణము గ్రాహ్యమె తెల్పవకుం? గడంక
నడవి గాచిన వెన్నెల యయ్యెనాదు
నుతులు, మంజులయుక్తమునుం దలంపు॥ 90

టీక ప్రభుని-(రా) రావణుని. (భా) ధృతరాష్ట్రుని.

రా.గీ॥ (కటకట జనించెఁ జెడుతఱి విటపికిఁ గడు
కుక్కమూతిపిందె లనఁగఁ గూకటులును
మూల లెనసి యక్కట వంశము సమయుటకు
ను ఖలమతి వొడమెన్) నాదునుడుల వినుము॥ 91

భా.కం॥ కటకట జనించెఁ జెడుతఱి
విటపికిఁ గడు కుక్కమూతి పిందెలనఁగఁ గూ
కటులును మూల లెనసి య
క్కట వంశము సమయుటకును ఖలమతి వొడమెన్॥ 91

టీక. ఖలమతి - (రా) దుష్టమగుబుద్ధి, (భా) దుష్టబుద్ధి యగు దుర్యోధనుఁడు.

రా.ఆ॥ (నేత, వినుము కుమతిని, విను సీతాజన
నంబు లంకచేటునకె సుమీ) సు
(నీతి వదల కిమ్ము నియతి చేతఁ, దగదు
నీకు మారుచెఱుపని ధరలో)న॥ 92

రా.కం॥ నేత, వినుముకుమతిని, విను
సీతాజననంబు లంకచేటునకె సుమీ,
నీతి వదల కిమ్ము నియతి
చేతఁ, దగదు నీ కుమారు చెఱుపని ధరలో॥ 92

టీక. కుమతి-(రా) దుష్టబుద్ధి, (భా) దుష్టబుద్ధియగు దుర్యోధనుని, నీకుమారు చెఱుపని - (రా) నీకుకుమారు-మన్మథుని, చెఱుపని, (భా) నీ, కుమారు-పుత్రుని చెఱుపని-సీతాజననంబు లంక చేటునకే (భా) సామెత. అనఁగా దుర్యోధనుని జన్మము నీవంశనాశనమునకేయని ధ్వని, నేత-ప్రభూ.

రా.సీ॥ (అన సుయోధనఖలుఁ డలుకఁ దాడితభోగి
వలెను బుస్సని, వెస బంట్ల నంపి)
నిలు వంటయింటికుందేలు వయి తని, తోక
కగ్ని నంటింపించి, యనిపేఁదిప్ప;
స్వనఖజ వహ్ని గాల్పకయుండె, లంకఁ బా
వని గాల్చె, మంటార్పకొనె, దనుజులు
(పట్టఁబోవఁగ హరి వారి వారించి, గ
గనముచేఁ దనరి, విరాడ్గతిఁ జనె)
గీ॥ సంగడాముల వద్దకు నబ్ధిదాటి,
వారిఁ గలిసి యరిగిఁ రామభద్రుకడకు
గంటి సీత మన్నాత లంక నని పలికి
పూస గ్రుచ్చినగతి సర్వము న్నుడివెను॥ 93
భా.ఆ॥ అన సుయోధనఖలుఁ డలుకఁ దాడితభోగి
వలెను బుస్సని వెస బంట్ల నంపి,
పట్టఁబోవఁగ హరి వారి వారించి గ
గనముచేఁ దనరి విరాడ్గతిఁ, జనె॥ 93
టీక. సుయోధనఖలుఁడు-(రా)రావణుఁడు, (భా) దుర్యోధనుఁడు, హరి-(రా) హనుమంతుఁడు, (భా)కృష్ణుఁడు, విరాడ్గతి, (రా) పక్షివలెను, (భా)విరాడ్రూపముచే, తాడిత-కొట్టబడిన, భోగి-పాము.
రా.సీ॥ దుఃఖకృత పదహతులఁబూచి నీపైనిఁ
జడుపూలె తెల్పుశుభము, తలపువు
వాడకుండు మనుచుఁ బలికితివనె, రాఘ
వుఁడు కీశసేనతోఁ గడలి డాసె,

నచట లంకను రాముఁ డని దిరుగ నవిభీ
షణుఁడు, వెండియును రావణు నకుంభ
(కర్ణుఁ గాంచెను, దినకాంతసంతతిసుకృ
తిభవమూలమును యుధిష్ఠిరు ధృతిఁ]

గీ॥ [జేరు పోనడవకు క్షితిఁ జెలువుగ శుభ
మగు నని పలుక వినఁడయ్యె నతఁడు,] వినక
తిన్నయింటివాసంబుల నెన్నదోష
యోముఖవివకుంభమ యని యుక్తికి తన్ను॥ 94

భా.ఆ॥ కర్ణుఁ గాంచెను దినకాంతసంతతిసుకృ
తిభవమూలమును యుధిష్ఠిరు ధృతిఁ
జేరు, పోనడవకు క్షితిఁ జెలువుగ శుభ
మగునని పలుక వినఁడయ్యె నతఁడు॥ 94

టీక. దుఃఖకృత...పూతె - (రా) అశోకవృక్ష మేకాల మందైనను స్త్రీల కాలితాఁపుచేఁ బుష్పించునని కవిసమయము. (రా) దినకాంత-సూర్యుని, సంతతి - వంశములోని, సుకృతి-మంచిపనుల జేసినవాని (రాముని) భవమూలమును-జన్మమర్మము [అనగా విష్ణుఁడు రాముఁడయి రావణుని కొఱకే యవతరించె నవుట) (భా) దినకాంత - సూర్యుని, సంతతి-కుమారుఁడగు (కర్ణుఁడు) సుకృతి, భవమూలము-జన్మమర్మము. (కర్ణుఁడు కుంతీసుతుఁడనుట) యుధిష్ఠిర-రాముని (రాముఁడు యుద్ధమునందు స్థిరుఁడని చెప్పెను గనుక యుధిష్ఠిర శబ్దము రామునకే యన్వయము) కీశ - కపులు, కడలి-సముద్రము.

రా.సీ॥ వచ్చి రాముశరణుఁ జొచ్చె విభీషణుం;
డతని దాశరథి లంకాధిపతిగ
నలుపుదు ననె; వార్ధి యలరి మిన్నందె ఖ
ఊఁదు నచ్చెనని; రాఘవుఁ డుదధి తన
కడ్డుపడెనని; సాయక మేయఁబూనఁ, గ
న్పడి సముద్రుఁడు సెప్ప నలునివలన
సింధుఁ గట్టెను; లంకఁ జేరె నంగదు సంధి
కై యంపనాతుమూఁడయ్యె నదియు;
గీ॥ (నెఱి నటులసంధి చెడుటయు హరి యరిగ ని
యోక్తపాలికంతట సునయోత్కరములు
తననుడులు, జవాబరిహట్టఁదను మొదలిడు
ట యఖిలము పలికెన్) బెల్లు నయముగ విని॥ 95
భా.కం॥ నెఱినటుల సంధిచెడుటయు
హరియరిగ నియోక్తపాలికంతట సునయో
త్కరములు తననుడులు జవా
బరి హట్టదను మొదలిడుట యఖిలముపలికెన్॥ 95
టీక. హరి-(రా) హనుమంతుఁడు (భా) కృష్ణుఁడు. నియోక్తృ
పాలికి-(రా) రామునికడకు. (భా) ధర్మరాజుకడకు. అరి-శత్రువు
తనుఁన్-తన్ను, హట్ట మొదలిడుట, సాయకము-బాణము.
రా.సీ॥ లీల "వినాశకాలే విపరీతబు
ద్ధి" యనుచు దాశరథి యును నీలు
(వరబలయుతు నాహవకృతి ధృష్టద్యుమ్ను
వీరుని నిజసైన్యాధిభుని జేసె,)
కొంకక వానరు ల్లంక కెగఁబడ న

సురథవాజ్ఞను (బహస్తుండు మెండు
(దండియగు యుధిష్ఠిరుండు భీష్ముండు దా
నురవడి నడపించె గురుబలంబు)

గీ॥ దనుజసేన; నదియు వాలితనయ గవయ
శరభ కేసరిసుగ్రీవజాంబవన్న
లగజమైందసుషేణనీలద్వివిదశ
తబలివాయుజముఖ్యులఁ దారసిల్లె॥ 96

భా.ఆ॥ వరబలయుతు నాహవకృతి ధృష్టద్యుమ్ను
వీరుని నిజసైన్యవిభునిఁ జేసి
దండియగు యుధిష్ఠిరుండు; భీష్ముండు దా
నురవడి నడపించెఁ గురుబలంబు॥ 96

టీక. (రా) ధృష్ట-దిట్టమైన ద్యుమ్ని-సత్త్వముగలవా
నివి,యుధిష్ఠిరుండు (రా)యుద్ధమందుస్థిరముగువాఁడు; భీష్ముఁడు-
ఘోరముగువాఁడు; గురుబలంబు - గొప్పసేన, (భా) కురుబ
లంబు-కౌరవసేన, ఆహవకృతి - యుద్ధమందునేర్పరి, ఉరవడి-
శౌర్యముతో.

రా.ఉ॥ చూపరి రాము దద్ (రిపులఁ జూచెను జిష్ణుఁడు (శీని;
బంధు)ర
(శీపతి దుష్టులౌ (జనులఁ జివ్వను నెంతయుఁ జంకమాన) దం
బా పరముం గనెన్ (హరియు; నాదటఁ బల్కెను హాలి
గీత)ముల్
(ద్రోపది (క్రోఁతులున్;(నరవరుండును బూని రణంబుఁ
జేయఁ)గన్॥ 97

భా.గీ॥ రిపులఁ జూచెను జిష్ణుఁడు శ్రీని; బంధు
జనులఁ జివ్వను నెంతయుఁ జంపమాన,
హరియు నాడటఁ బల్కెను వాలి గీత;
నరవరుండును, బూనె రణంబుఁ జేయ॥ 97

టీక. జిష్ణుఁడు - (రా) దేవేంద్రుఁడు (భా) అర్జునుఁడు, హరి-(రా) దేవేంద్రుఁడు (భా) కృష్ణుఁడు, గీతముల్-(రా) పాటలను (యుద్ధమునకు ముందుత్సాహముచేత) గీత-(భా) భగవద్గీత. నరవరుండు-(రా) రాముఁడు (భా) అర్జునుఁడు, చూపరి-అందగాఁడు, చివ్వ-యుద్ధము, ఆదట-ప్రేమ ప్రోడడి-ఒకరిచే నొకరు ప్రోయబడుచు.

రా.సీ॥ రవిజుండు కపులతోఁ జెవియొగ్గి వినుఁడు నా
ది శిలాంకురము విరోధిబలమునకు
వెన్నఁజూపకుఁడు చూపిన యమాలయమున
కతిథు లయ్యెద రని; ననఁగ వారు
కాసుపీనముగాదు క్రవ్యాదులు, చిదిమి
పెట్టెద చిచ్చుఱ పిడుగులమాయి
రాయి గ్రుద్దెదము వారితలలనుఁ దన్నె
దమని గంతులిడి రుత్సాహమునను;
గీ॥ (ఘనగతిని దక్షిణోత్తరవనధు లలుక
గొనుచుఁ బెనగుభాతినిఁ గడుగొబ్బున నిరు
మొనలు గవిసి చేసెను యుద్ధమునఁ బదహతు
ల క్షితియును వడఁకన్,) బోరలఘువు నయ్యె। 98

భా.క॥ ఘనగతిని దక్షిణోత్తర
వనధు లలుక గొనుచుఁ బెనఁగు భాతినిఁ గడుగొ

బ్బున నిరు మొనలు గవిసి చే
సెను యుద్ధమునుఁ బదహతుల క్షితియును వడఁకన్ ॥98

టీక. ఉత్సాహమునను - వీరరసముతో, క్రవ్యాదులు-రాక్షసులు, గొబ్బున-త్వరగా, మొనలు-సైన్యములు.

రా.గీ॥ (ధర బయలు నిండు టంకృతులరొద నడఁగు
హుంకృతుల్, చలంబు నెనయు యోధరథహ
యగజచయముఁ గప్పు రజంబు, నతిశితవిశి
ఖములతతి, చెలఁగెన్) భయంకరముగఁ గన॥ 99

భా.కం॥ ధర బయలు నిండు టంకృతు
లరొద నడఁగు హుంకృతుల్, చలంబు నెనయు యో
ధరథహయగజచయముఁ గ
ప్పు రజంబు, నతిశితవిశిఖములతతి చెలఁగెన్॥ 99

టీక. భయంకరముగన్-భయానకరసముగాన్, బయలు-ఆకాశము, చలము - పట్టుదల, ఎనయు - కూడు, చయము-గుంపు, రజము-దుమ్ము, విశిఖములతతి-బాణసమూహము.

రా.గీ॥ (చెడఁ గరులు, గూలెఁ దేరులు, పడిరి భటులు,
సమసె భూరివాజులు, పెలుచన్ వడిఁ జనె
రక్తనదులునుం గడు భాసురగతి శిరము
లెగసె నభమునకున్,) జుగుప్సగ ననిమనె॥ 100

భా.కం॥ చెడఁ గరులు గూలెఁ దేరులు,
పడిరి భటులు, సమసె భూరివాజులు, పెలుచన్
వడిఁ జనె రక్తనదులునుం,
గడు భాసురగతి శిరము లెగసె నభమునకున్॥ 100

టీక. జుగుప్సగన్-భీభత్సరసముతోన్, వాజులు-గుఱ్ఱములు.

రా.గీ॥ (దురపుభువి, రక్తమె జలము, కరము శవము
లె లహరిఁ జను కట్టెలు, మెదడే) తెలియఁగు
(నురు, గెముకలె చేఁపలు, పొల బురద, కచమె
నాచుగఁ, బొలుపుం గనె నదినాఁ) మఱియును॥ 101

భా.కం॥ దురపుభువి, రక్తమె జలము
కరము శవములె లహరిఁ జను కట్టెలు, మెదడే
నురు, గెముకలె చేఁపలు, పొల
బురద, కచమె నాఁచుగఁ, బొలుపుం గనె నదినాఁ॥ 101

టీక. రెంటికి లహరిన్-ప్రవాహమందు, పొల-మాంసము కచము-వెండ్రుకలు, దురపుభువి-యుద్ధభూమి.

రా.గీ॥ (అని విజయరక్షకై హరుల నడపి పురు
షోత్తముఁడు చెలంగెఁ, బెనఁగి రొప్పి నరవ
రుఁడు రణకృతిపావని దస్రరుహులు మిగులు
(ద్రుపదముఖ్యులనన్) లక్ష్మణపృథుబలుఁడు॥ 102

భా.కం॥ అసి విజయరక్షకై హరు
ల నడపి పురుషోత్తముఁడు చెలంగెఁ, బెనఁగి రొ
ప్పి నరవరుఁడు రణకృతి పా
వని దస్రరుహులు మిగులు ద్రుపదముఖ్యులనన్॥ 102

టీక. అనిన్-యుద్ధమందు, విజయరక్షకై (రా) జయమును సంపాదించుటనిమిత్తమై (భా) అర్జునుని రక్షణకొఱకు, హరుల-(రా) కపులను (భా) గుఱ్ఱములను, పురుషోత్తముడు-(రా) రాముఁడు-(భా) కృష్ణుఁడు, నరవరుఁడు, (రా) రాముడు అర్జునుఁడు, రణకృతి-(రెంటికి) రణమందు నేర్పరియగు, పావని-

(రా)హనుమంతుడు, (భా)భీముఁడు, దస్రసుహృత్తులు-అశ్వినుల, కుమారులు (రా) మైందద్వివిదులు (భా) నకులసహదేవులు మిగులు-(రా) శేషించిన (భా) హెచ్చయిన ద్రుపదముఖ్యులు (రా) ద్రు-వృక్షమును, పద-స్థానముగాఁగలిగిన వారిలో (కపులలో)ముఖ్యులు-శ్రేష్ఠులు (భా) ద్రుపదుఁడు మొదలగువారు.

రా.చం॥ బిరుదగు నింద్రజిద్ (బలుఁడు భీష్ముఁడు వైరుల వాసిరీతి)గా
మురువగునట్టి నా (గశరముల్ నిగుడించుచు గాసిపెట్టి) సం
గరమున వేడ్కతో (మురియఁగా, హరిచక్రము పూనె, జిష్ణు)జి
ద్వరకృతి దోల నా(కతనఁ దా మరలెన్‌(వృథగాఁగ పూనిక)యున్॥ 103

భా.గీ॥ బలుఁడు భీష్ముఁడు వైరుల వాసిరీతి
గశరముల్ నిగుడించుచు గాసిపెట్టి
మురియఁగా హరి చక్రము పూనె, జిష్ణు
కతనఁ దా మరలెన్ వృథగాఁగ పూనిక॥ 103

టీక. భీష్ముడు-(రా) భయంకరుఁడు, నాగశరముల్-పాము బాణములను, హరిచక్రము-కోతులగుంపు, జిష్ణుజిత్-ఇంద్రజిత్తు, (భా) హరి-కృష్ణుడు, చక్రము - సుదర్శనచక్రమును, మురువు-అందము, గాసి-బాధ, కతన-కారణమున.

రా.సీ॥ తనయునిఁ గననీక తమములఁ గప్పి రా
కాసుఁ డట్లు మించ, నగజాని శత్రు
(భీష్మకసుతను నేగెఁ బ్రీతి యుధిష్ఠిరుం)
డగు లక్ష్మణుఁ, దతని కాజితరిపుఁ

(దధికభక్తి నెఱఁగె, నడిగె దాను) విరోధి
పురమును బ్రహ్మాస్త్రము వలనను ద
హించు నాజ్ఞ నిడ, వాఁ డెందు నున్ననుఁ జెల్లు
నటులైన ననె, రాముఁ డంటివి కడు
తే॥ నరిగ(జయము నొందుగతి, నిజము, రణపు వె
రవు) సునీతి బాహ్య మొక యరాతిఁ గాఁచు
గూల్ప సర్వాస్త్ర మంత్రాఱుఁగు వల దెందు
ననుచు (న్యాయబుద్ధిఁ బలుక నతఁడు ననియె॥) 104

భా.ఆ॥ భీష్ము కడకు నేగఁ బ్రీతి యుధిష్ఠిరుం
డధికభక్తి నెఱఁగె నడిగెఁ దాను
జయము నొందు గతి, నిజమరణపు వెరవు
న్యాయబుద్ధిఁ బలుక నతఁడు ననియె॥ 104

టీక యుధిష్ఠిరుండు - (రా)యుద్ధమున స్థిరముగ వాఁడు, ఎఱఁగె నమస్కరించె (రా)నిజము, రణపువెరవు-యుద్ధమార్గము, (భా)నిజ-తనయొక్క- మరణపువెరవు-చావునకుదారి, తెనుము-చీకటి.

రా.చం॥ నవ(గ్రమ దోప వైరిజననాశముఁ జేయుచు శత్రు
భీష్మ న
(ద్భావను శిఖం)డి రొందు నరి రాముని లక్ష్మణుఁ గీశులన్
ఘనం
బు వ(డి మాఱుంగగా మహిని మోదముఁ బొంద నేసి
యేగఁ దా
ను విజయుఁ డన్) జితేంద్రుఁడును నొంచె ఖగేంద్రుఁడు
పాప తూపులన్॥ 105

భా.కం॥ రము దోఁప వైరిజననా
శముఁ జేయుచు శత్రుభీష్ము సద్భవరు శిఖం
డి మఱుంగుగా మహిని మో
దముతోఁ బడనేసి యేగెఁ దాను విజయుఁడున్॥ 105

టీక. (రా)శత్రుభీష్మ - శత్రువులకుభయంకరుని, (భా) శత్రున్-విరోధియగు, భీష్మున్-భీష్ముని (రా) శిఖండి-నెమలి, రౌతు - వాహనముగాఁ గలవాని (కుమారస్వామికి) సరి-(పరాక్రమమందు) తుల్యుని, విజయుఁడు-(రా) జయశీలుఁడు, జితేంద్రుఁడు-గెలువబడిన యింద్రుఁడు గలవాఁడు (ఇంద్రుజిత్తు) పాపతూపులన్-నాగబాణములను.

రా.సీ॥ అని యయ్యె వెండిఁ, బాపనియు ధూమ్రాక్షు న
కంపనుఁ జంపె, నంగదుఁ డడఁచె మ
హాకాయుఁ, గెడపె బ్రహస్తు నీలుం, డంత
వినఁబోక మండోదరినుడు లక్షు
(గురుఁడు ప్రతినఁ బట్టెఁ బరఁగు యుధిష్ఠిరు)
(శ్రీరాఘవునిఁ జంపి సీతఁ జెట్టఁ
(బట్టఁ, గుట్ట కొరకఁడు చెట్టున కొరకఁ దైరి
పరులు నారయ నడుప గురుసేన)
గీ॥ దనుజబలము నాతఁడు, మించె హనుమ నీలు,
శక్తి లక్ష్మణు నొంప దాశరథి దోలె,
నిద్ర లేపఁగఁ బల్కియు సీతుల ఘట
(కర్ణుడు వెడలె ధృతిగనఁ గలనికి) వెస॥ 106
భా.ఆ॥ గురుఁడు ప్రతినఁ బట్టెఁ బరఁగు యుధిష్ఠిరుఁ
బట్ట, గుట్ట కొరకఁడు చెట్టున కొరక

శౌరి పరులు నారయ నడుపఁ గురుసేన;
కర్ణుడు వెడలె ధృతిగనుఁ గలనికి॥ 106

టీక. అక్షగురుఁడు-(రా) అక్షకుమారుని తండ్రి (రావణుఁడు) (భా) గురుఁడు-ద్రోణుఁడు, యుధిష్ఠిరు (రా) యుద్ధమందు స్థిరమగువానిని, గురుసేన-(రా) గొప్పసేన, కురుసేన (భా) కౌరవసేన, పరులు-విరోధులు, ఘటకర్ణుఁడు-కుంభకర్ణుడు, కలనికి-యుద్ధమునకు.

రా సీ॥ హరుల జేఁవులు పట్టి యాడించె రవిజుచే
ముక్కు గోల్పడె; వచ్చి పోరెఁ బోలి
నిండుచెక్కుఁ గలంచు (దండిగజము, గూడి
కొండగతి భగద) త్తుండు మేటి
ఘోరశరీరుండు కుంభకర్ణుండు మ
(త్తుఁడు నరవరు చేతఁ బడె; బలుఁడభి)
మానియు వీకండు (మన్యుఁడు రిపులోక
మహితపద్మవ్యూహ) మదకరియయి
గీ॥ తనరు దేవాంతకుని నరాంతకుని హనుమ
యును ఋషభుఁడు మహాపార్శ్వుని నడచి రతి
కాయుఁడు గురుయుద్ధ (మానసఁ గాలమొనరి
చెను బెనఁగుచు) లక్ష్మణుచేత; దనుజవిభుఁడ॥ 107

భా ఆ॥ దండిగజముఁ గూడి కొండగతి భగద
త్తుఁడు నరవరుచేతఁ బడె, బలుఁ డభి
మన్యుఁడు రిపులోక మహిత పద్మవ్యూహ
మునను గాల మొనరిచెను బెనఁగుచు॥ 107

టీక. హరుల - (రా) కపులను (రా) భగ-శక్తియందు,

దక్షుండు ప్రవీణుఁడు నరవరుచేత-(రా) రామునిచేత-(భా)
అర్జునునిచేత, మనుష్యుఁడు (రా) కోపి-(రా) పద్మవ్యూహ-
తామరగుంపువలె. రామాయణమునక్రిందిపద్యమునకన్వయము.

రా.గీ॥ (తనయుమరణంబునకు లలిగనుఁ బోగిలెఁ ద
నుఁ గడుఁ దేర్పగా స్వజనులునున్, ధృతిజిత
(ఘనబలితజిష్ణుఁ డెవ్వఁడు వనటనుఁ గలి
గించె వానిపైఁ నెద నలిగెఁ) మఱియును॥ 108

భా.కం॥ తనయుమరణంబునకు లలి
గనుఁ బోగిలెఁ దను గడుఁ దేర్పగాస్వజనులునున్
ఘనబలితజిష్ణుఁ డెవ్వఁడు
వనటనుఁ గలిగించె వానిపై నెద నలిగెన్॥ 108

టీక. జితఘనబలితజిష్ణుఁడు-(రా) గెలువబడిన గొప్పబల
ముగల దేవేంద్రుఁడు గలవాఁడు (ఇంద్రజిత్తు) (భా) జిష్ణుఁడు-
అర్జునుఁడు, లలి-ఎక్కువ.

రా.ఉ॥ ఆరసి తండ్రిసన్ (శపథ మాకృష్ణసఖుఁడు సల్పె
సింధు)గం
భీరుని భూమిజా(విభుని భీమబలాఢ్యుని బిడ్డఁజేయుఁ) దా
ఘోరము భావిత(ద్యుమణి గ్రుంకక యుగ్రతనొప్ప,దూఱి) రే
నైరిసిఁదాశర(స్ఫురిత వహ్నిని జంపనిచో నటంచు)నున్॥ 109

భా.గీ॥ శపథమా కృష్ణసఖుఁడు సల్పె సింధు
విభుని భీమబలాఢ్యుని బిడ్డ జేయ
ద్యుమణి గ్రుంకక యుగ్రత నొప్ప; దూఱి
స్ఫురితవహ్నిని జంపనిచో నటంచు॥ 109

టీక. (రా)సింధు-సముద్రపు, భూమిజావిభుని - సీతమగ

విరటు నాదట గూల్చెను వీక శత్రు
ద్రుపదసింహము సూర్యసుతుండు చూడ॥ 112

టీక. గురువరుండును-(రా) గొప్పశ్రేష్ఠుడు, (భా) ద్రోణుడు, (రా) వావిరి - అటున్, (భా) విరటు - విరాటరాజును, ద్రుపద సింహము-(రా) వానరశ్రేష్ఠుడగు, (భా) ద్రుపదునిన్, సూర్య సుతుడు-(రా) సుగ్రీవుడు, (భా) కర్ణుడు, మాను - ఒప్పు, దాయులు-శత్రువులు.

రా.చం॥ దణి ఘననాదుడున్ (మిగిలె దానవిశత్రుల మించి; చంపె)ల
క్ష్మణుడును వానినిన్; (వినియె జానగుపుత్రుడు బిద్దె నంచు)దు
ర్గుణుడగునిద్రజిద్ (గురుడు; గూడె నతండును గోడు; వాని)దా
రణకృతిసైన్యముం(బొలిపె రాముడు సైన్యవిభుండు హెచ్చ)కాన్॥ 113

భా.గీ॥ మిగిలె దానవి శత్రుల మించి చంపె;
వినియె జానగు పుత్రుడు బిద్దె నంచు
గురుడు; గూడె నతండును గోడు; వాని
బొలిపె రాముడు సైన్యవిభుండు హెచ్చ॥ 113

టీక. (రా) యింద్రజిద్గురుడు-రావణుడు, సైన్యవిభుడు-నీలుడు, హెచ్చ, కాన్-కాగా, అనగా సంతోషింపగా, (భా) గురుడు-ద్రోణుడు, సైన్యవిభుడు-ధృష్టద్యుమ్నుడు, దణి-ప్రభువు, జానగు-ఒప్పుచుండు, బిద్దట-చనిపోవుట, కృతి-సమర్థత, పొలిపె-చంపెను.

రా.సీ॥ సైన్యమాగతిఁ గూల (సరిగ నడపె సూర్య
సంతతిక్కృతి లలిఁ జంప రావ
ణుఁడు దైత్యుల రవిజుఁ డడచె విరూపాక్షు
నవనిఁ గల్పె సుపార్శ్వు నంగదుం, డ
సురపతి రావించి (గురుబల మెదిరించె
నరునిశల్య)ములు నెంతని రవికుల
శశి; విభీషణుఁ జేసె (సారథి; వచనాళి
మీఱె దుశ్శాసను) శౌరు లక్ష్మ

గీ॥ ణు దశముఖుఁడు మూర్ఛిలఁ జేసెను; ప్లవగధృతిఁ
బెలుచ (వీకతోడ జదిపె; భీమయోధ)
సీతమగఁడుఁ ద్రోలె; గొన సంజీవనిఁ జని
కని హనుమ శత్రు ముని వేషు గాలనేమి॥ 114

భా.ఆ॥ సరిగ నడపె సూర్యసంతతిక్కృతి లలిఁ
గురుబల మెదిరించె నరుని శల్య
సారథివచనాళి మీఱె; దుశ్శాసను
వీఁక తోడఁ జదిపె భీమయోధ॥ 114

టీక. సూర్యసంతతిక్కృతి-(రా) సూర్యవంశమందు నేర్పరి (రాముని) (రా) సూర్యపుత్రుడగు నేర్పరి (కర్ణుఁడు) (రా) చంప-చంపుటకై, గురుబలము-గొప్పసేన (భా) కురుబలము-కౌరవసేన నరుని - (రా)మానవునియొక్క, (భా) అర్జునుని, దుశ్శాసను-(రా) ఆణపరాని వానిని, భీమయోధ-(రా)భయంకరుఁడగు యోధుఁడు (భా) భీముఁడను యోధుఁడు, శల్యములు-బాణములు, ప్లవగ-కపుల, పెలుచ-ఎక్కువ.

రా.చం॥ కడు(వగగూడ భూసురునిగాటగుశాపముచేత నైన యా
రడిం దనతే)జమాఱిన సురామనుం గాచెను, బొంది రావణుం
డను(రుగడంకం(గుంగ, నరికచ్చుగంజావుమరుద్వరాత్మజుం
డిడె;లలింగాన్)రిపుండటులనీల్గగ దెచ్చెను ద్రోణశైలమున్॥ 115

భా.కం॥ వగగూడ భూసురుని గా
టగుశాపము చేత నైన యారడిం దనతే
రు గడంకం గుంగ, నరిక
చ్చుగంజావు మరుద్వరాత్మజుండిడె లలిగాన్॥ 115

టీక. సురామను-(రా)ధాన్యమాలిని, (రా) మరుత్-వాయువునకువర-శ్రేష్ఠుడగు;ఆత్మజుండు-కుమారుడు-(హనుమంతుడు (భా)మరుత్-దేవతలకు, వర-ప్రభుని (ఇంద్రుని)ఆత్మజుండు-కుమారుడు(అర్జునుడు)

రా.చం॥ అరి(జనలోకభీకరుండునై తన భీషణశక్తిచేతం దా
గురుబలమున్)మహోదను జక్కోటినిం గూల్చెను; మాల్యవంతు నా
శన(ఘనసేనం దోలుపృథుశల్యునిం జంపె యుధిష్ఠిరుండు నో
ప్పారణమునన్)వరుం డనిలపుత్రుండు దారిని; మించె లక్ష్మణుడ్॥ 116

భా.కం॥ జనలోకభీకరుండునై
తనభీషణశక్తిచేతం దాం గురుబలమున్
ఘనసేనం దోలుపృథుశ
ల్యునిం జంపె యుధిష్ఠిరుండు నోప్పారణమునన్॥ 116

టీక. శక్తిచేత (రా) బలముచేత (భా) శక్తియను నాయుధము చేత, (రా) గురుబలమున్-గొప్పసేనను, (భా) కురుబల

ము॥ – కౌరవసేనను, ఆశర-(రా)రాక్షసుల, పృథుశల్యని-(రా) గొప్పబాణములుఁ గలవానిని (భా)గొప్పశల్యుని, యుధిష్ఠిరుండు-(రా)యుద్ధమందు స్థిరమైయినవాఁడు.

రా.సీ॥ నగముంచి దానిస్థానమున మరలి వచ్చె
నీదశం; దెలసె మండోదరి యల
జడిరావణుజననా (శకునిపోక కనిఁ ద
మకమునఁ హీడిద్వై)మాతురపితృ
భక్తుండు దీక్షవల్నగ హోమము ( జెఱుపఁ
గపులువచ్చిరి, నేలికైకొలిచన
భార్యనీడ్చుటను ను (పాయనమున, డాగు
వాసుయోధ)ఖంగని సురరిపువిభు

గీ॥ ననుచునాగతిఁజేసి వేయంగదునుము
(నుము బిరుసుయుధిష్ఠిరుడు బలుమసుకృతియు
వీఁక(వెడలదో)యుగ్గఁజనెఁ బెనకువకును)
దశముఖుడు నిప్పులొ్రాల్కె నేత్రంబులందు॥ 117

భా.ఆ॥ శకునిపోక కనిఁ దమకమున హీడి ద్వై
పాయనమునడాగు వరసు యోధ
నుము బిరుదు యుధిష్ఠిరుడు బలుమ సుకృతి
వెడలఁదోయుగ్గఁజనెఁ బెనకువకును॥ 117

టీక. శకునిపోకకు – (భా)శకుని చావునకు, అని-యుద్ధమును, (రా) ద్వైమాతుర-వినాయకుని. పితృ-తండ్రి (శివుని) ఉపాయనమున, (రా)కానుకచేత, యుధిష్ఠిరుడు-(రా) యుద్ధమందుస్థిరనుగువాడు, ఈడకందు-వాయుపుత్రుడగు హనుమంతుడు, అలజడి–చింత, తమకమున – సంభ్రమమున, పోక-

(రా) నడవడి, (భా) చనిపోవుట, పెనకువ-యుద్ధము, కేళికై...
యనుచు-పరిహాసమున కారీతి పలుకుచు,

రా. చ॥ చని(పెన భూమి శ్రీ గదల నద్వసుధాజనదూరుఁ జేచి, పా
యనిధృతిఁ బో) రనేసెను మహాస్త్రము లాకపు లుల్క,
వానికిన్

వన(కొసగంగ గంతుగొనె వాయుసుతోరుహతుండునై
సుయో
ధనబలుఁడున్)ఖలుం డధిక ధైర్యసమేతుఁడు ఖడ్గరోముఁ
డున్॥ 118

భా. కం॥ పెన భూమి శ్రీగద లన
ద్వసుధాజనదూరుఁ జేచి పాయనిధృతిఁబో
కొసగంగ గంతుగొనె వా
యుసుతోరుహతుండునై సుయోధనబలుఁడున్॥ 118

టీక. (రా) కదల-కదలగా, (భా) గద-గదయనునాయు
ధముతో, (రా) వాయుసుతు-హనుమంతునిచే, ఊరుహతుం
డునై (భా) వాయుసుత-భీమునిచే, ఊరుహతుండునై-తొడలు
విఱుగ గొట్టబడినవాఁడై, సుయోధన-(రా) మంచియోధుఁడు.
చేచి-విజృంభించి. ఉల్క-భయపడున్లు, గంతుగొనె-చచ్చెను.

రా. సీ॥ అరివచ్చు నపుడైన (పరఁగ ఘూకకృతి క
లరుచు, పశ్చిమాము)లకముఖభువి
జము తేనెఁ గఫులు దాశరథి సంగరమహి
(మాతులబలు నంతచేతఁ; గృష్ణ)
ఘోరతనుఁదితి (కొడుకులఁ దమిఁ గూల్చె
నడఁచె స్పష్టమ్ముమ్ముగా)సంగమముఁడు

క్రూరగుణుని సర్పరోముఁడన్ రాక్షసుఁ;
(గాలుపురికి నంపె ఘనుఁశిఖండి)
ఆ॥ గమనుఁబోలు నీలుఁ డమర వృశ్చికరోము;
నగ్నివర్ణు రాముఁ డణఁచె; మాత
లి రహిఁ దెచ్చిన మఘవురథమెక్కి; నపహృ
తామృతుండు నయ్యె నసురవిభుఁడు॥ 119

భా ఆ॥ పరఁగు ఘూకకృతి కలరుచు నశ్వత్థామ
మాతులబలునండ చేతఁ గృష్ణ
కొడుకులఁ దమిఁ గూల్చె, నడచెఁ ధృష్టద్యుమ్నుఁ
గాలుపురికి నంపె ఘను శిఖండి॥ 119

టీక. ఘూకకృతికి-గుడ్లగూబపనికి, (రా)(శత్రువునకయిన దుశ్శకునమునకు) (రా) అశ్వత్థ-రావిచెట్టు, అనులక-ఉసిరిక చెట్టు, సంగరమహిమ-యుద్ధప్రౌఢియందు, అతుల-సమాన రహితుఁడు, (భా) మాతుల - మేనమామ (కృపుని) కృష్ణ-(రా) నల్లని, (భా) ద్రౌపదియొక్క, తమి-(రా) కోరికతో (భా) రాత్రియందు, ధృష్టద్యుమ్నుక్-దిట్టమైన సత్త్వముగలవానిని; శిఖండిగమను - నెమలి నెక్కిపోవువాఁడు (కుమారస్వామి) మఘవు-ఇంద్రుని.

రా.ఉ॥ రోసము మించగా (నరవరుండు నతండు నొనర్చి రాజి)
విన్
వేసెను రాముఁడుక్ (బలిమి భీషణలీలనుఁ బన్నగాస్త్ర)మె
చ్చౌ సరి నన్ని బా(ములను, నారిపు తేజము మొత్తె; వేగ)నా
దోసిఁగూల్చెఁ, దద్ (విజయుదోర్బలమర్మిలి వేల్పు లెన్నఁ)
గన్॥ 120

భా.గీ॥ నరవరుండు నతండు నొనర్చి రాజి
బలిమి భీషణలీలనుఁ బద్మజాస్త్ర
ములను; నారిపుతేజము మొత్తె వేగ
విజయు దోర్బల మర్మిలి వేల్పులెన్న॥ 120

టీక. నరవరుండు (రా) రాముఁడు (భా) అర్జునుఁడు, ఆజి-యుద్ధమును; పద్మజాస్త్రము-బ్రహ్మాస్త్రము, (రా) ఎచ్చా-హెచ్చుగ, బాముల-కష్టముల, విజయు-జయశీలుని, దోర్బలము-భుజబలము, అర్మిలి-ప్రేమ.

రా.ఉ॥ తా క్షితి నిట్లు దుష్టులను దంచి తగం బురుషోత్త
ముండు శ్రీ
దక్షుఁ బరీతభూతి ఘనతాయుతు నింద్రుని దైత్యబాధ సం
రక్షితు సాఁకె; రాజగను రాజితుఁడయ్యె యుధిష్ఠిరుండు క్షే
మదక్షుఁడున్ విభీషణుఁడు మంగళుఁడై రఘురాము
నావలెన్॥ 121

భా.కం॥ క్షితి నిట్లు దుష్టులను దం
చి తగం బురుషోత్తముండు శ్రీదక్షుఁ బరీ
క్షితు సాఁకె, రాజగను రా
జితుఁడయ్యె యుధిష్ఠిరుండు క్షేమదక్షుఁడున్॥ 121

టీక. పురుషోత్తముఁడు-(రా) రాముఁడు (భా) కృష్ణుఁడు, పరీత-(రా) చుట్టుకొనబడిన, యుధిష్ఠిరుండు-(రా) యుద్ధమందు స్థిరముగువాఁడు, దక్షుఁడు-(రెంటికి) ఉత్సాహముగలవాఁడు, దంచి-నాశనముచేసి, భూతి-ఐశ్వర్యము

రా.సీ॥ అగ్నిలోఁ జొప్పించి, యతివపాతివ్రత్య
ముఁ బరీక్ష సల్పి రాముండు క్షితి

బ్రహ్మేంద్రముఖ్యామరనుతులఁ గొని, తండ్రి
ప్రత్యక్షమైనంత భక్తి నెఱిగి,
యవనిజాశాలక్ష్మణాదులతోఁ బుష్ప
కము నెక్కి వచ్చి గరిమ నయోధ్యఁ
బట్టాభిషిక్తుఁడై ప్రబలెఁ దమ్ములు గొల్వఁ;
బుత్రులను గుశలవులనుఁ గాంచె;
గీ॥ (సలిపె హయమేధ మత డలర లలి బుధులు;
ప్రజలు రామరాజ్యము మఱువన్) జన ముని
(బలువిడలఁ గొందనేలెను; నెలకుఁ దిగజ
ము లోలసెఁ బ్రజ నీతిగనెఁ గడున్) సుఖమున॥ 122

భా.కం॥ సలిపె హయమేధ మతఁడల
ర లలి బుధులు ప్రజలు రామరాజ్యము మఱువన్
బలుపిడల రొండ నేలెను;
నెలకుఁ దిగజము లోలసె,; బ్రజ నీతిగనె గడున్॥ 122

టీక. రెంటికి, హయమేధము-అశ్వమేధయజ్ఞము, తిగ
జఁదులు-మూఁడువానలు, పలువిడి-ఎక్కువ.

కం॥ శర్మదముల నీకథల వి
నిర్మలమతిఁ బాడిన న్వినినఁ జదివిన స
ద్ధర్మమయుఁడు సర్వేశ్వరుఁ
డర్మిలితోడుత నొసఁగు మనోభీష్టంబుల్॥ 123

కం॥ శ్రీరావిపాటి లక్ష్మీ
నారాయణ యొనరిచె రచనన్ గర్భమునన్
భారత మిడి నిర్వచనము
గా రామాయణముఁ జంద్రకమలాప్తముగన్॥ 124

టీక. శర్మదములు-సంతోషమునిచ్చునవి.

చక్రబంధము.

మొదటి మూడుపాదములందలి మొదటినుండి మూడవ చివరనుండి మూడవ యక్షరములు కవిపేరును, మొదటినుండి యాఱవ చివరనుండి యాఱవయక్షరములు గ్రంథముపేరును తెలుపును.

శా॥ రక్షోరాతి పరాత్పరా వరద ధీరా రమ్యశూరాన్వితా
దక్షాలక్షణ మత్తసంహర కృతీ దాతక్రమా యచ్యుతా
రక్షానాకులభాగ్యమా వరగభీరా ముక్త బాణప్రతా
తాక్షోణీరమణా దయాశరధి భూతాళిస్తుతా కామితా॥125

ఆటవెలది ([ ]లోఁ దెలుపఁబడినది) కందము(( )లో దెలుపబడినది)గర్భమునఁగలుగుగీతముతోఁగూడినట్టియుకంద() లోఁదెలుపఁబడినది)గీతము ([ ] లోఁ దెలుపబడినది) గర్భమునఁ గలుగుచంపకమాల()లో దెలుపబడినది) గర్భమునఁ గలుగు నట్టిదగు శుద్ధాంధ్రరహిత సీసము.

సీ॥ (అతి(కరుణాత్ముడా [పతి యనంతరసాన్వి
తప్రస్ఫుటాంగ] తా) త సుగుణకలి
(త తతబలా) ప్రభూ [పతితతారక సద్ధృ
తి (ప్రాజ్ఞవీర] సం) ధితరుచిర వి
(తత(వర్గదాయకా [యతుల నవ్యరమాయు
త ఖ్యాతియుక్త] (పా తకరహిత ల
(లితసుభగా) విభూ [కృతి సులేఖ సుధీవ
ర(శ్రేష్ఠబంధు) రా) రమ్యచరిత

గీ॥ [నత (వరద రవిశశినయన పర పరమ
పురుష భక్తతోష భరితభువన] భా) స
[హిత (సురమునిజనవినుత హతదితిసుహ
త్రిగుణమయ లసన్నతివితతిసుధ]దా)త॥ 126

సీసములో నాలుగుపాదముల యందును 16 వ అక్షరములగు త,తి,త,ర,లు సీసమునందు గురువులు తక్కిన కంద గీత చంపక మాలలందులఘువులు. అనఁగా సీసమునందు అనంతరసాన్వితప్రస్ఫుటాంగ, సద్ధృతిప్రాజ్ఞ, నవ్యరసాయుత ఖ్యాతియుక్త, సుధీవరశ్రేష్ఠబంధుయని యొక్కొక్కదానిని సమాసముగఁ జదువవలెను. కంద, గీత, చంపకమాలలందు అనంతరసాన్విత, ప్రస్ఫుటాంగ, సద్ధృతి, ప్రాజ్ఞ, నవ్యరసా యుత. ఖ్యాతియుక్త, సుధీవర, శ్రేష్ఠబంధుయని వేఱువేఱుగా జదువవలెను.

గద్యము. ఇదివిద్వద్విధేయ, రావిపాటి చలమయామాత్య
పుత్ర లక్ష్మీనారాయణ ప్రణీతంబయిన
నిర్వచన భారతగర్భరామాయణము
సర్వము నేకాశ్వాసము.

సంపూర్ణము.

# తప్పొప్పులపట్టి

అచ్చు సరిగాపడని యక్షరములు, జ జే లు, అర్ధాను స్వారములు, థ ధ లు, ( ) మొదలగునవితప్పు.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 2 | వయస్సు | వయసు |
| 7 | 1 | తనయుఁడుఁమగాన | తనయుఁడుఁగాన |
| 7 | 2 | స్వాంత, మందు | స్వాంతమందు |
| 7 | 10 | సమఖ్యుడు | సమాఖ్యుడు |
| 7 | 19 | కుంభిరపు | కుంభిరిపు |
| 8 | 22 | ళ్లో | శ్లో |
| 9 | 21 | భ్రేఘుఘు | బ్రౌఘుడు |
| 16 | 18 | మని | ముని |
| 23 | 7 | బలు | బల్ |
| 25 | 24 | పంచనాయక | పంచసాయక |
| 26 | 11 | కడిమి | బలిమి |
| ,, | ,, | కర్ణ శల్య | వాటుకర్ణ |
| 27 | 6 | బిసజాన్ | బిసజానన |
| 32 | 23 | పక్షిది | పక్షిని |
| 41 | 17 | హూరి | హారి |
| 51 | 4 | గడంగి | గడంక |
| 52 | 21 | వారలరు | వారలము |
| 52 | 10 | బలమొవ్వ | బలమొప్ప |
| 54 | 20 | స్ఫరణు | స్ఫురణు |
| 57 | 11 | హాహుమంతును | హనుమంతుడు |
| 69 | 19 | దనజవిభుడు | దనుజవిభుడు |
| 72 | 9 | సుదర్శన్ | సుదర్శన |
| 72 | 16 | మకరరాక్షు | మకరాక్షు |
| 77 | 23 | ఘోరతనుఁ | ఘోరతనులఁ |

# ఈ గ్రంథకర్తయొక్క ఇతర గ్రంథములు.

1. "సర్వేశ్వర శతకము" ప్రకృతిమూలమున భగవంతుని గొనియాడు శతకము. 0-2-

2. మాచర్ల చెన్నకేశవ శతకము
3. గురజాల యిష్టకామేశ్వర శతకము
4. పల్నాటి వీరగాథ (వచనము)
5. నాగార్జునకొండ చరిత్రము (వచనము)

} పునర్ముద్రణమున నున్నవి

6. పల్నాటి చరిత్ర (వచనము) 0-8-

ఇందు పల్నాడు నేలిన ప్రభువులు, పల్నాడు కవులు, గాయకులు, దేవాలయములు, శిలాశాసనములు, శ్రీనాధక పల్నాటి సంచారమందు జెప్పిన పద్యములు, నాగార్జునకొం చరిత్ర, వీరచరిత్ర మొదలగున వెన్నిరెూ పొందుపరచబడి చరిత్రాత్మకమైన గ్రంథరాజము.

---

వలయువారు :-

రావిపాటి లక్ష్మినారాయణగారు,

గురజాల.

(గుంటూరు జిల్లా.)